Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102923

# గోలకొండపత్రిక




సంపుటము ౧౪ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ విక్రమసం|| శ్రావణ శు|| ౪ (౭-౧౧-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౭౮

ఈస్టిండీస్ దీవులకై జపాను యత్నము

సైనికాధి పతులతో హిట్లరు ఆలోచనలు

# ఫిన్లెండును కలుపుకొనన రష్యాసాకు?

## బ్రిటిషు అధికారమున్న చోట్లలో జపానీయుల అరెస్టులు

### జపాను పత్రికల ఆగ్రహము

గతసంచికలో జపానునందు బ్రిటిషువారల అరెస్టు సమాచారమును గమనించియుంటిమి. గతవారాంతమునుండియే బ్రిటనులో ప్రసిద్ధి వణిక్ప్రముఖులగు జపానీయుల అరెస్టులు ప్రారంభమైనవి. ఆగస్టు ౨౭వ తేదినాటికి ఇరువురు జపానీయులు అరెస్టుచేయబడిరి, వారిని ఎందుకై అరెస్టుచేసినారో కనుగొనుటకై బ్రిటనుప్రధాననగరమగు లండనులో జపానుప్రభుత్వమువారి రాయబారి అరెస్టు ౨౮వ తేదిన బ్రిటిషు విదేశాంగమంత్రియగు హాలిఫాక్సు ప్రభువుగారిని దర్శించి సంభాషించగా, ఆఅరెస్టులు జపానులో బ్రిటనులఅరెస్టుకు ప్రతిక్రియ కాదనియు, బ్రిటనుదేశరక్షణకై విదేశీయులనరెస్టుచేయుట ఇంతవరకు ఎట్లు బ్రిటిషు విధానమైయుండెనో ఆవిధానము ననుసరించి ఆయరెస్టులు జరిగినవనియు సమాధానములభించెను. అందుపై జపానురాయబారి అరెస్టుచేయబడిన జపానీయులు బ్రిటనుకు విరుద్ధముగా ఏమియుచేయలేదని రుజువగుననుటకు వెలిబుచ్చి వెలిపోయిరి. జపాను రాయబారి కార్యాల యోద్యోగులతో రూటరుప్రతినిధి సంభాషించినపుడు, ఆయుద్యోగులు అరెస్టు చేయబడిన జపానీయులు ఆంగ్ల జపానీయ మైత్రి పోషకులని ఖ్యాతిగాంచినవారని చెప్పినారు. అందువల్ల ఈ అరెస్టులు బ్రిటను జపానుల సంబంధమునకు చిక్కు కలిగించవచ్చునని వారలు భయపడుచున్నట్లు తెల్పినారు. జపానులో పత్రికలు ఈఅరెస్టులయెడ ఆగ్రహమును వెల్లడించుచు దెబ్బకుదెబ్బ వేయవలసినదని గోలపెట్టినవి.

మరిఇద్దరు

ఈగోల ఇట్లుండగానే ఆగస్టు ౨౯వ తేదినాటికి ఇంగ్లాండులో మరిఇరువురు జపానీయులరెస్టు చేయబడిరి. వీరలుకూడ గొప్ప వణిక్ప్రముఖులు. వీరలలో ఒక స్త్రీయుండెను. ఆమెను విడిపించుటకై లండనునగరమందలి జపాను రాయబారి సలహాదారుడగు ఓకామాటో గారు బ్రిటిషు విదేశాంగశాఖ కార్యాలయమునకు పోయి యెంతో దూరము నచ్చజెప్పి యత్నించినను ప్రయోజనము లేదయ్యెను. మరువాడు వారల నిరువురను ఇంగ్లాండునుండి బ.ఎ.టికి పంపివేయుటకు ఆజ్ఞలు గావించబడెను. తర్వాత అదృష్టవశాన ఆగస్టు ౩౦వ తేదినాడు అరెస్టుచేయబడిన జపానీయులలో నొకరు ఆగస్టు ౩౧వ తేదినాడు విడుదల చేయబడెను.

ఇతర చోట్లలోకూడ

ఇంగ్లాండులోనే గాక బ్రిటిషువారి అధికారముక్రిందనున్న ఇతరచోట్లలోకూడ జపానీయుల అరెస్టులు జరిగినవి. ఆగస్టు ౨౮వ తేదినాడు సింగపూరులో ఒకడును, రంగూను [illegible] మును, హాంగుకాంగులో ఒకడును జపానీయులరెస్టు చేయబడినారు.

అరెస్టుచేయబడిన బ్రిటనులు

ఆగస్టు ౧వ తేదినాటికి మొత్తము ౭గురు బ్రిటిషువారు జపానులో ఇంకను నిర్బంధములో నున్నట్లు చూచియుంటిమి. ఆగస్టు ౨వ తేది జపానులో మరియిద్దరు బ్రిటిషువారు అరెస్టు చేయబడిరి.

జపానులో బ్రిటనుల అరెస్టుల కారణమును గూర్చి బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభలో ప్రధానమంత్రి గారో లేక విదేశాంగ మంత్రి యొక్క అండర్ సెక్రటరీ గారో ఆగస్టు౬వ తేదినాడు ఒకప్రకటన చేయగలరని సమాచారము చేరినది. ఆప్రకటన ఇంకను తెలియలేదు. జపానుప్రభుత్వ విదేశాంగశాఖ యొక్కయు నౌకాశాఖ యొక్కయు ప్రధానాధికారులు ఆగస్టు ౫వ తేదిని జపాను ప్రధాననగరమగు టోకియోలో కలిసి ఆలోచించిరి గాని బ్రిటనులో జపానీయుల అరెస్టులవిషయమై ఏమియు నిశ్చయించలేదు. బ్రిటిషువారినుండి ఇంకను వివరములను కనుగొనుటకై వేచియున్నారట

అమెరికాకు జపాను మొఱ

అమెరికా ప్రభుత్వమువారు పశ్చిమార్ధగోళమునకు వెలుపల ఏదేశమునకు గాని అమెరికాపెట్రోలును అమ్మరాదని ఆజ్ఞగావించుట తమపై ద్వేషదర్శ్యమగునని జపాను ప్రభుత్వమువారు అమెరికా ప్రభుత్వమునకు తమ ఆక్షేపణను తెలియబరచినారు

## ఈస్టిండీస్ దీవులకై జపాను ఆశ

ఈఆగస్టునెల ౨వ తేదితర్వాత ౭వ తేదివరకు వచ్చినవార్తలలో ఒక ముఖ్యవార్త ఏమనగా, ప్రిన్సుకానోయి గారు జపానుప్రధానియైన తర్వాత దచ్చివారి ఈస్టిండీస్ దీవులకు జపాను ప్రభుత్వపక్షమున నిర్ణయించబడిన ప్రత్యేక రాయబారి ఆగస్టు౩వ తేదినాడు జపానుకు ఈస్టిండీస్ దీవులు కావలెననుకాంక్షను బహిరంగముగ వెల్లడించినారు. అతడు పత్రిక లప్రతినిధులతో సంభాషించుచు ఈస్టిండీస్ దీవులు విదేశీయులక్రింద ఉండి చాల పీడించబడినవనినాడు. జపాను తూర్పు ఆసియాలో నిర్మించదలచిన ఆర్థిక మహాకూటములో జపాను, మంచూకో, చైనాలేగాక దక్షిణ సముద్రముకూడ చేరునని చెప్పినాడు. ఆదీవులు ఇప్పటిస్థితిలో మాత్రము ఉండరాదనియు, ప్రాగ్దేశజనులను పాశ్చాత్యుల ఆక్రమణమునుండి విడుదలచేయక తప్పదనియు చెప్పినాడు. ఈస్టు ఇండీసుదీవులలో దొరకురబ్బరు మున్నగు పదార్థములను జపాను గుత్తాగొనవలెనని కోరదుగాని ఇతరదేశాలతోపాటు తనకుకూడ అందులో సమానభాగము కావలెనని జపాను కోరుచున్నది



ని వారుచెప్పిరి. ఇపుడు ఆదీవుల రబ్బరు అధికముగా అమెరికాకుపోవుచున్నది. అందుచే జపానుకోరిక తీర్చుకొనుటకు అమెరికాతో సంఘర్షణవచ్చినను జపానుసిద్ధపడవలెనని వారు చెప్పిరి. మొత్తముమీద కోనోయిగారి హయాము అన్ని దేశాలపైనను కాలుదువ్వుటతో సరిపోవుచున్నది. జపానుకిపుడు సైనికకండూతి (మరద)పుట్టినట్లున్నది.

## ఫ్రెంచి ఇండోచైనాకు జపాను ప్రతినిధి వివరణము

ఫ్రెంచిఇండోచైనాలో జపాను ప్రభుత్వమువారి పరీక్షాధికారుల కార్యాలయ మొకటి ఏర్పరచబడియున్నది కదా? దాని ప్రధానాధికారి ఆగస్టు ౬వ తేదినాడు ఫ్రెంచి ఇండోచైనా గవర్నరు గారికి ఏదియో ముఖ్యవిషయమునకు సంబంధించిన మెమొను దేనినో గావించినారు. ఆవిషయము ఏదియో తెలియుటలేదు.

## షాంఘాయిలో చైనావారిపై దౌర్జన్యాలు

షాంఘాయిలో చైనావారిపై దౌర్జన్యాలు ప్రారంభమైనవి. సన్‌గ్‌చంగ్ ట్సేన్ అను చైనీయుడు ఆగస్టు ౨వ తేదిని ఎవరిచేతనో అపహరించబడెను, సన్‌గ్‌జంగ్‌దో అను చైనీయుడు హత్యాప్రయత్నములో పోవలసినవాడు తప్పించుకొనగలిగినాడు. యెన్‌లాన్‌షిన్‌గ్ అను ఒక చైనీయ పత్రికా సంపాదకులలో చేరినవాడుకూడ అపహరించబడినాడు ఈకేసు జపానుకు విరుద్ధములైనచర్యల నవలంబించుచుండినట్లు చైనాలో జపానుచే స్థాపితమైన నాంకింగుప్రభుత్వమువారు ఇదివరలో ప్రకటించియున్నారు.

## భూకంపము

ఆగస్టు ౨వ తేది ఉదయము హొకెయిడో దీవియొక్క పశ్చిమసముద్రతీరమున కావలసముద్రమునందొక మహాతరంగము లేచి ౧౩౦౦ బెస్తపడవలను ఊడ్చివేసినది. అంతకుపూర్వము ఆదీవి ప్రధాననగరమగు సాపోరో భూకంపముచే గడగడవణకెను. గాంధిమహాత్ముడు భారతదేశములో బీహారుభూకంపము వచ్చినపుడు అది పాపము పండినదానికి ఫలితమనియుండిరి. అదేవిధముగ జపానునురాజులకిది ఫలితమగునా? కానిదీనితో జపాను బెదరునా?

జపానీయాధికారి మరణము

ఫ్రెంచి ఇండోచైనాలో జపానువారేర్పరచినపరీక్షకవర్గములో నౌకరగు కమాండర్ మొటోకియో గారు దక్షిణచైనాలో జులై ౭వ తేదినాడు ఒకముఖ్యకార్యములో నుండగా మరణించిరి.

ఆస్ట్రేలియా జపానుల సంబంధాలు

ఆస్ట్రేలియాలో జపానుప్రభుత్వప్రతినిధియైన కన్సలు ఆగస్టు ౫వ తేదినాడు ఒకపత్రికాప్రతినిధితో ముచ్చటించుచు ఆస్ట్రేలియాకును జపానుకును వివాదాంశములేవి గానిలేవనియు, ఆస్ట్రేలియా జపానులమధ్య టెలిఫోనుఒకటి ఏర్పరచినచో మైత్రిఇంకను వృద్ధియగునవనియు చెప్పెను.

## జిన్నాకు వైస్రాయి ఆహ్వానము

వైస్రాయిగారు ముస్లింలీగు అధ్యక్షులగు ఎం. ఎ. జిన్నాగారిని ఆగస్టు ౭వ తేదిన తనను బొంబాయిలో చూడవలసినదిగ ఆహ్వానించినట్లు తెలిసినది జిన్నాగారు ఆహ్వానమంగీకరించిరి

## హంగరీ కోరికలకు ప్రతిఘటన

### రుమేనియాలో క్రొత్త ఉద్యమము

రుమేనియా ప్రభుత్వప్రతినిధులు ట్రాన్సిల్వేనియాను తమకిచ్చివేయవలెనని హంగరీ ప్రభుత్వము రుమేనియాప్రభుత్వమును కోరుచున్నదానివిషయమై తొద్దిరోజులలో హంగరీప్రభుత్వముతో సంభాషణలు సాగింపనున్నారు. ఈసంభాషణలు త్వరగా ముగియకపోవచ్చునని అక్కడిపరిస్థితుల పరిచయముగలవారు చెప్పుకొనుచున్నారు. ఇది బహుశా హిట్లరు బ్రిటనుతో యుద్ధము పూర్తిచేయువరకు హంగరీని నిరాశచేయకుండ కాలయాపన చేయుటకుపనికివచ్చునట్లుగా హిట్లరుచే నిర్ణయించబడియుండును.

ఈలోగా హంగరీకోరికకు ప్రతిబంధకములు కొన్ని ఉదయించి విజృంభించుచున్నవి. ఇతరరుమేనియాలో ఎవరికిగాని ఏభాగమునుగాని యివ్వరాదని ఒకఆందోళనలేచినట్లును దానికేంద్రముగ నేషనల్ పెజంట్ పార్టీ జాతీయకర్షకపక్ష నాయకుడగు మానియోగారు ఉన్నట్లును గతసంచికలో చూచియుంటిమి. "ప్రియమైనదేశములో ఒక్కఅంగుళమునుకూడ ఇతరులకుపోనీయవద్దు ప్రజలారా. మీరుచిక్కులో పడ్డప్పుడు మీ నాయకులు మిమ్ములను వదలివేతురు. కాబట్టి అట్టిఉద్యోగి కాంక్షులను నమ్మకమీరు స్వయముగా లెండు" అనుభావముగల కరపత్రములను మానియోగారు వేలకొలదిగ ప్రజలకు పంచిపెట్టినారు. ఇట్టి కరపత్రాలనే రుమేనియాలోని ఐరన్‌గార్డు అనుపార్టీయొక్క కార్యదర్శిగారును పంచిపెట్టినారు. ఈ ఐరన్ గార్డు పార్టీ రుమేనియాలో నాజీ అపార్టీవంటిదని గుర్తించుకొన్నచో ఈపార్టీయు, ఇంకను నాజీపక్షపాతముగల కొన్నిపత్రికలును రుమేనియాహంగరీ, బల్గేరియాల సంతృప్తికై ఏమాత్రము రాజ్యభాగాల నీయరాదని ఘోషించుట, హిట్లరుగారే ఈ ఆందోళనను లేవదీసియుందురని అనుమానించుటకు వీలుకలుగజేయుచున్నది, బహుశా అటుహంగరీబల్గేరియాలను ఇటురుమేనియాను సంతృప్తిపరచుటకు హిట్లరు ఇట్టిఎత్తునవలంబించియుండును. కాని మనియోగారు ట్రాన్సిల్వేనియాలోని హంగరీజాతీయ కార్మికులుకూడ ఆప్రాంతము రుమేనియాలో నుండవలెననియే కోరుచున్నారని ఆగస్టు ౫వ తేది ఒకప్రకటనలో తెల్పిన ధోరణి చూడగా సోషలిజం ధోరణిగానుండి, మానియోగారు అవసరమైనచో హంగరీకోరిక ప్రతిఘటనకై రష్యాసహాయముకోరుదురని అనిపించుచున్నది.

ఈలోగా, రుమేనియాలో పూర్వపు "లిబరల్ పార్టీ నాయకులును, "ఐరన్ గార్డు పార్టీ" నాయకులును ఒకటిచేరి మనియోగారిని తనకిష్టమువచ్చినవారలను మంత్రివర్గమున కెన్నుకొనుటకు సర్వాధికారముతోనైనను ప్రధానమంత్రిగజేసి రుమేనియా హంగరీకోరికలను ప్రతిఘటించునట్లు చేయవలెనను కాంక్ష దృఢతరమగుచున్నది.

మనియోగారు ఆగస్టు ౫వ తేదినాటి ప్రకటనలో రుమేనియాప్రభుత్వము హంగరీప్రభుత్వపు కోరికలదీర్చుటకై హంగరీప్రభుత్వముతోగాని మరేప్రభుత్వముతోగాని సంభాషణలు జరుపుటకూడ తనకిష్టములేదనిచెప్పినారు.

ఇపుడు జర్మనీలో పత్రికలు హంగరీకి ట్రాన్సిల్వేనియాను ఇవ్వడు హంగరీయుద్ధిచేయుకున్నచో ముందుముందుఇంకను ఎక్కువప్రదేశము నీయవలసివచ్చునని రుమేనియాప్రభుత్వమును బెదరించుచున్నవి. హంగరీకోరికను తీర్చకుండ తప్పించుకొనజాలదని ఘోషలు చేయుచున్నవి.

## తుర్కీ

తుర్కీలో జర్మనీ రాయబారియగు హెర్ వాన్‌పేపన్‌గారు హిట్లరుతో మాట్లాడుటకై బెర్లినునగరానికి పోయియుండిరి గదా! వారు తిరిగివచ్చుచు ఆగస్టు ౩వ తేదినాటికి బల్గేరియా ప్రధాననగరమగు సోఫియాకు వచ్చిచేరిరి. అక్కడినుండి తుర్కీ ఆదేశాల ప్రయాణమైరి. నీవు బ్రిటను రష్యాపైకుట్ర చేయుచున్నట్లు తుర్కీకి తెలిసి యు అన్యాయము తోడ్పడుచున్నదను ఆరోపణలను వ్యాపింపజేయుచు తుర్కీకిని రష్యాకును సంఘర్షణ పెట్టజూచుచున్నారని తుర్కీలో ఆందోళనచెందుచున్నారు.

## గ్రీసు

గ్రీసు ప్రధానిగారు ఆగస్టు ౪వ తేదినాడు తనదేశీయులకు బ్రాడ్‌కాస్టుచేయుచు గ్రీసు యిప్పటియుద్ధంలో తటస్థముగా నుండగలదనియు, తనస్వాతంత్ర్యముపై దాడిజరపలిన ఎవరినైనను ఎదిరించి పోరాడగలదనియు చెప్పిరి. ఈచిన్నదేశపు తాటస్థ్యము, పోరాటపు సామర్థ్యము ఈకాలములో అక్కరకురాగలవా?

## ఫిన్లెండుపై రష్యా గుడ్లురుముట

బాల్టిక్ ప్రాంతములో రష్యాసోవియటుపద్ధతి నేర్పాటుచేయుచున్నది. లిథుయేనియాసోవియటులో చేర్చబడినట్లుసోవియటు పార్లమెంటువారు ఆగస్టు ౩వ తేదినాడు ఆమోదించిరి. మరునాడే "తెల్లరష్యా రిపబ్లిక్" అను ప్రదేశములో లిథుయేనియా జాతివారెక్కువగానున్న కొన్ని జిల్లాలు లిథుయేనియాకుచేర్చబడినట్లు వార్తవచ్చినది. ఇపుడు లిథుయేనియా స్వాతంత్ర్యమే పోయిన తర్వాత ఆజిల్లాలు చేర్చినందుకు సంతోషమెవరికి? ఆగస్టు ౭వ తేదినాడు ఎస్తోనియాలో కొం

(౧౨వ పేజీచూడుడు)

# హిట్లర్ లూటీ

బ్రిటీషుకు ఫ్రాన్సుబంగారు దొరకునా? యూరోపులోని ధాన్యము.

నాజీలు తూర్పునకు త్రోసుకొని పోవుదురేమో?

"న్యూస్ క్రానికల్" నుండి

మిత్రమండలివారు ఫ్రాన్సును వదలుకొన్నందులకు కలిగినసష్టమును గొప్పదని ఒప్పుకోవలసినదే? అని ఒకలండన్ తంతీయిట్లు చెప్పుచున్నది.

జర్మనీకి యుద్ధలాభమే కాకుండా చాలాతుపాకులు, ట్యాంకులు, ఇంకా యితర మిలటరీసామానులు దొరికినవి. ఇవివారికి యుద్ధములో చాలా పనికివచ్చును, జర్మనీలో తక్కువైన సూనె అట్టియితరవస్తువులికముందు ఫ్రాన్సులోనిలాటినుండి భర్తీ చేయబడును. ఫ్రాన్సులో కూడబెట్టినసూనె బహుశా కొన్నిలక్షలటన్నుల నూనె యైయున్నది.

ఫ్రాన్సునుండి ఎంతబంగారు అమెరికాకు పంపబడిందో తెలియదు. అయితే పారిస్‌లో ఏమియు ఉంచలేదని గట్టిగా తెలుస్తుంది. ఫ్రాన్సులో మిగిలిన బంగారును లాగుకొనుటకు జర్మనీ చాల ప్రయత్నించెను. అయినా బలవంతంగా ఫ్రాన్సుసమితిని జర్మనీపొందుటకునుక అమెరికావారు బంగారాన్ని ఇప్పుడు ఫ్రాన్సువశము చేయరు. అయినా ఉత్తబంగారుతో జర్మనీ యేమి చేసుకుంటుది. బ్రిటిషువారు దానిపై అష్టదిగ్బంధనము చేసినారుగా ఇకదానికి సరుకులిచ్చేవారలెవరు?

రానురాను ఫ్రాన్సువలన జర్మనీకి లాభంలేదు. ఎందుకంటే ఫ్రాన్సులో నికెల్, మున్నగు లోహాలులేవు. మరియు అచ్చట లాభంలేదు. ఎందుకంటే ఫ్రాన్సులో నికెల్, మున్నగు లోహాలులేవు. మరియు అచ్చటనూనెలేదు. రేలబొగ్గుకూడ తక్కువ. ముడిపదార్థాలుకూడా లేవు, భోజనపదార్థాలును చాలాతక్కువ. కావునజర్మనీకలలన్నీ వ్యర్థమైనవే. యూరోపు ఖండమంతా చక్బందీఅయిందంటే ముందుసంవత్సరంలో తిండికియిబ్బందిఅగును. రష్యాకూడా యేమిన్ని సహాయము చేయజాలదు. నూనెకూడా చాలాతక్కువైపోతుంది. జర్మనీలో రంలక్షలటన్నులనూనె వస్తుందినిజమే. కానిఅదిచాలదు, రుమేనియాలోని ౨౦లక్షలటన్నులుకూడా జర్మనీకి చాలవుండావస్తవి.

ఇంగ్లాండును పాదాక్రాంతంచేసేముచ్చట అటుండ. జర్మనీకికావలసిన భోజనపదార్థాలకు అదితూర్పుదిక్కుగా యితరదేశాలమీద ఎగపడవలసివస్తుంది. జర్మనీ ఆఫ్రికాదిక్కు లేక నూయజుదాటి తూర్పుదిక్కు యుద్ధము సాగించవలెను. ఈప్లాను ఎగిరిపాతే అది డార్డనెల్సుదిక్కుపోవును. అప్పుడు దానికిన్ని రష్యాకున్ను సంఘర్షణ జరుగును.

---

### అష్టావధానము

(స్వ.వి.) సూర్యాపేట, ౨౧-౧౦-౪౯

కేటిసాయంత్రము (౫ఘంటలకు) భోనగిరిశంభయ్యగారి నూతనగృహమున శ్రీ, ఆశుకవి కేసరి, అవధానధురంధరాది బిరుదాంకితులు శతావధానులు శ్రీపత్రి త్ర్యంబక రావుగారు అష్టావధానమును చేసియుండిరి. వీరు బెజవాడవాస్తవ్యులు. సభకు ప్రద్యోగులు, వర్తకులు, వకీల్సు, రైతులు, విద్యార్థులు మున్నగువారు సుమారు రెండువందలమంది వచ్చియుండిరి. వీరిలో హిందువులు, మహమ్మదీయులు క్రైస్తవులుకూడాయుండిరి. శ్రీయుత గవ్వా అమృతరెడ్డివకీలుగారు సభికులకు అష్టావధానిగారిని పరిచయించుచు వారిపాండిత్య కవిత్వ విషయము విపులముగా తెలిపిరి. అష్టావధానము ఆరంభింపబడెను. కవిగారుఅన్ని ప్రశ్నలకు తగురీతి ప్రత్యుత్తరమిచ్చిరి, ఘంటలలెక్కలో మాత్రము వరు తప్పిపోయిరి. ౨౨ఇషహరేవరురోజు గ్రామ ముత్తమున చందాలు వసూలుచేయగా రు౧౫లు గనూలయియుండెను. వీటిని ౨౭తారీఖు సాయంత్రము ఈవుగ్రంథాలయములో కవిగారికి శ్రీయుత అమృతరెడ్డిగారిద్వారా అందజేయబడెను. కవిగారు వారిసహజమైన ఆశుకవిత్వములో ఈపురజనులను. పురమును ఆశీర్వదించి, కానియాడి వానినిస్వీకరించి మమ్ము నానందింపజేసిరి. ౨౮తే దిఉదయము మోటారులో వారు యిచ్చటినుంచి నల్లగొండవెళ్ళిరి.

---

## అమీన్‌గారి కోళ్లగతి

(స్వ.వి.) ౧౬-౧౦-౪౯

వారముక్రోజులక్రిందట సిరిసిల్ల అమీన్‌గారు చీర్లవంచెకు దౌరాపోయి వుండిరి. ఇంటికి తిరిగివచ్చేవరకు వారికోళ్లు ౧౨అమాంతంగా మాయమైయుండెను. అతిసమీపములోనున్న పిచ్చకుంట్లవాళ్ళదగ్గర మూడుకోళ్ళు అమీన్‌గారికోళ్ళవతుయున్న పట్టితెప్పించి, తక్కినకోళ్ళు ఎక్కడున్నవని పిచ్చకుంట్లవాండ్లను కొట్టి నిర్బంధించిరి. ఈవిచారణ జరుగుచుండగనే చీర్లవంచనుంచి మొకద్దంకోత్వాల్ ఒకరిపోర్టు అమీన్‌గారికి పంపిరి, అందులో "అమీన్‌గారు దౌరాలో నున్నవాడే ఆ దేగ్రామములో ఒకమహమ్మదీయుడు ౧౬కోళ్లను పద్మశాలీయులకమ్మి పెట్టానని చెప్పిపోయినాడు. తమకోళ్లు పోయినవనివింటిని. గుర్తుపట్టితీసుకపోగలరు" పోయిచూచినవారి కోళ్లే! దొంగను పట్టుకొనజాలకపోయిరి, నిరపరాధులగు పిచ్చకుంట్లవాండ్లను విడచిపెట్టిరి. బహుశలోచన లక్షర్యాల దొంగ వచ్చునారు తా॥ కరీంనగరము వాడని తెలిసినది. వాడు పూర్వము అమీన్‌గారి ఇంట్లో నౌకరిగానుండెనట, దొంగరిమాండులోనున్నాడు.

### పునాస పైరుల దుస్థితి

సిరిసిల్ల ౧౫-౧౦-౪౯

పదిహేనురోజులనుంచి ముసురుసాగించి చేలన్నిజాలుపట్టి ఎర్రబారిపోయినవి. ౧౩-౧౪ తేదులరాత్రులలో రెండుమూడు దుక్కుల వర్షముకురిసినచేలన్ని పూర్తిగజాలుపట్టి చెర్లకుంట్లలోనికి కొట్టుకొనివచ్చినది, మాగాణి సున్న, పునాస నష్టము రైతులకేమిఆధారము.

### బంచరాయిపన్ను వసూలు

దయామయులగు ప్రభుత్వమువారు సిరిసిల్ల తాలూక, కటువుబాధ నొందుచున్నందున అన్ని తాలూకలతోపాటు ఈ తాలూకాకుకూడ ఈసంవత్సరము బంచరాయిపన్ను ఆపివేయవలసినదని గష్తీజారీ చేసియుండిరికదా! కటువుకాలము తోయి కఋవు సమీపించుచున్నను. అమాయుపు, అజ్ఞానగొల్లలదగ్గర మొకద్దంపట్వారీలు బంచరాయి వసూలుచేయుచున్నారు.

### యుద్ధనిధి వసూళ్లు

మల్లారెడ్డిపేట ౧౬-౧౦-౪౯ ఫ

సిరిసిల్ల తాలూకఅంతట యుద్ధనిధులు విరివిగావసూలగుచున్నవి. మాషుదార్లను, దేశముఖ్‌దేశపాండాలు, ముక్తేదార్లు, జాగీరుదార్లు, రుసుముదార్లవద్ద మిక్కుటముగా వసూలైనవి. ధనికవర్గపు సాహుకార్లు, గ్రామాధికార్లుకూడ పెక్కుమొత్తములుచెల్లించిరి. ఈసంవత్సరము కటువుకాలము చే పంటలుపండనైనందున, రైతుకష్టములు తొలగించ దయామయులగు ప్రభుత్వమువారు సిరిసిల్లతాలూకకు సగముశిస్తు బరాయిందపెట్టిరిగదా! ప్రస్తుతము మేతలేక, తిండిలేకవిలపించుచున్నరైతులను ఈ గ్రామములో గిర్దావరుగారు రైతులను చందాలివ్వమనుచున్నారు.



## నిజామాయుర్వేదసంఘ తృతీయ వార్షికోత్సవము

(స్వ. వి.)

మహబూబునగరము, షహరేవరు ౨౭ తేదీ ఈసంఘపు కార్యదర్శిగారగు శ్రీ వేంకట నారాయణగారు కొందరిసభ్యుల వెంటగొని బ్యాండుయుక్తంగా అధ్యక్షులవారిని రామమందిరమునకు ఉదయం ౧౧గంటలకు తెచ్చిరి. వారివెంబడే కొందరువ్యాపారస్థులు తదితరులు సభనలంకరించిరి. కనీసము ౨౦౦ జనముతో నిండినదటిసమావేశము ఉదయం ౧౧ం నుండి ౧౨ గంటలవరకు జరిగెను. ఇతరగ్రామస్థులు పలుగురైనగురు వైద్యమెంబర్లుగావచ్చియుండిరి. సర్వత్రులు నిరుత్సాహులై కూర్చొనియుండిరి.

శ్రీరంగం సుబ్బరాయశాస్త్రిగారి అధ్యక్షులనుగాఁజేసిరి.

శ్రీవారి అధ్యక్షోపన్యాసము కడు గంభీరముగా వైద్యులకేగాక సామాన్యప్రజలకుగూడ బోధపడేయట్టుగావుండెను. శరీరారోగ్యమునుగూర్చి మానవులు నడుచుకొను విధులనన్నిటిని తేటతెల్లముగా విశదపరచిరి,

శ్రీమాన్. రంగాచార్యులవారు ఆయుర్వేద ప్రతిభనుగూర్చిఉపన్యసిస్తు ప్రతిసంవత్సరము ఈ సంఘముకృషిచేసి వృద్ధిపొందుటకు మాయత్నించుచుండుటనుగూర్చివిచారమును వెలిబుచ్చిరి వీరి కృషియొక్క నిదర్శనమే నవనాటి సమావేశములోని సమూహమే తెలుపుచుండెను. కార్యదర్శిగతనివేదికనుచదివి వినిపించెను. ఆహ్వానసంఘాధ్యక్షులవారగు విలూరు కృష్ణశర్మగారు త్రిదోషములగూర్చి యుపన్యసించిరి.

శ్రీ బాలకృష్ణహకీంగారి కూతురగు శశికళ "శిశుపోషణము"గూర్చి ఉపన్యసిస్తు వాక్చాతుర్యమును వెలిబుచ్చెను.

ఈ జిల్లాలో వైద్యశాలలతోసహా బీదలకొరకుర్యార్థమై ధర్మవైద్యశాల యొకటి స్థాపింపవలయునని తీర్మానము ముందుపెట్టబడెను. దీనిని గూర్చి రాచమల్ల గంగయ్యగారు ప్రతిపాదించిరి. గౌరయ్య హకీంగారుకూడా కొన్ని వైద్యవిషయములు చర్చిస్తు ఈతీర్మానము బలపరచిరి,

## ఘోరహత్యల పరంపర

### భూమయ్య వకీలుగారి హత్య

సిరిసిల్ల, షహరేవరు ౨౫

౨౪-౧౦-౪౯ ఉదయము స్థానిక హైకోర్టు వకీలగు, శ్రీఅంకూరిభూమయ్యగారు కరీంనగరములోపేషీవుండి ౧౧గంటలమోటారులోపోవుచుండెను. ౧గంటలకు తనస్వంతదావాలో చంద్రంపేటగొల్లవానిపై సమన్ తామీలు చేయించుటకై అదాలతుచప్రాసీని తన పాలేరువానిని వెంటబెట్టుకొని సిరిసిల్లకుచేరువనున్న చెంద్రంపేటకు పోయెను. గొల్లవాడు గ్రామములో లేనందున తన పాలేరునువెంబడిచ్చి అదాలతుచప్రాసీని తామీలునిమిత్యంపంపి తిరిగివచ్చుచుండెను. మార్గమధ్యన ఇరుకుల్ల వెంకయ్యగారితోటకు కొంతదూరమున వీరుహత్యగావించబడిరి. మెడలువిరిగినవి. పురసాంగమువడిబెట్టిరి. నోటిలోమన్నునింపిరి. కొంకులువిరుగగొట్టిరి. చివరకుప్రాణముతీసి శవమును కాలిపోయిరి. పదిగంటలాయెను. మోటారు సమయమువచ్చెను. వకీలుగారిభార్యఎదిరిచూచి పాలేరువాన్ని పంపించెను. పాలేరువాడు శవమునుజూచి ఈవార్తభార్యకు తెలిపెను. పోలీసుపటేలు అమీన్‌గారికి రిపోర్టుపంపిరి. అమీన్‌గారు పంచులతీసుకొని శవముకడకేగి పంచనామాచేసుకొనిరి. వీరిమరణవార్త సిరిసిల్లజనులు తండోపతండంబులుగా వెళ్ళిచూచి కడువిషాదముతో వీరిగుణములబొగడుచు గృహోన్ముఖులైరి. అమీన్‌గారు ముగ్గురుగొల్లలఅరెస్టుచేసిరి. ఈవకీల్‌గారు గాండ్లకులములోబుట్టినవారు. నిరాడంబరజీవి సాత్వికుడు వీరికిసంతానములేదు. వీరిదబాయమంత వ్యవసాయములో వ్యయపరచువారు. వీరుఅపక్షపాతి

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర శ్రావణ శు॥ ౫

గురువారము


## మ. ఘ. వ, ప్రభువుగారు

మ. ఘ. వ. నిజాం ప్రభువుగారికి మొన్న మంగళవారమునాడు ౫౫ ఏండ్లు నిండి ౫౬ సంవత్సరము ఏర్పడినది. ఈ సందర్భములో వారి ప్రియమైన ౧ కోటి ౬౫ లక్షల ప్రజలు తమ ఆనందాన్ని ప్రకటించుచున్నారు. ఈ ఆనందము హృదయపూర్వకమైనట్టిది శ్రీవారి రాజ్యపరిపాలనలో కలిగిన అభివృద్ధి అందరికిని తెలిసిన విషయమే. పునరుక్తి అవసరములేదు, శ్రీవారి రజతోత్సవమువలెనే స్వర్ణోత్సవమును, రత్నోత్సవమును జనులు చూచి ఆనందించు కాలము రావలెనని మేము కోరువారము. శ్రీవారికి భగవానుడు సంపూర్ణాయురారోగ్యమును ప్రసాదించుగాకయని ప్రార్థించుచున్నాము.

## బాల్యవివాహ నిషేధము—సంస్కారప్రియుల కర్తవ్యము

బాల్యవివాహ మవసరమా? అనవసరమా? అదిశాస్త్రీయమా? అశాస్త్రీయమా? దానివలన లాభమా? నష్టమా? అను చర్చలు చేయుకాలము దాటిపోయినది. బ్రిటిషిండియా యంతటను బాల్యవివాహ నిరోధకశాసనము కావించి యెన్నియో యేండ్లైపోయెను. కొన్ని పెద్ద పెద్ద భారత దేశీయ సంస్థానములలోను అట్టి శాసనములు కావింపబడి యున్నవి. మన హైదరాబాదు రాష్ట్రములోను హిందువుల కొరకై యిట్టి బాల్యవివాహ నిషేధశాసన మొకటి శ్రీమాన్ కొండా వెంకటరంగారెడ్డి వకీలుగారు శాసనసభా సభ్యులుగా నుండిన కాలములో ప్రవేశపెట్టియుండిరి. వారిప్పుడు శాసనసభాధ్యక్షులు కారు. వారి కాలములో దానికి మోక్షము రాకపోయెను. ఇప్పుడు శాసనసభలో సభ్యులుగానున్న శ్రీమాన్ మంగముల నరసింగరావుగారు అదే శాసనానికి నాథులైనారు.

ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయాన్ని కనుగొందుము అని నిర్ణయించిరి. ఆటుతర్వాత కొందరు సనాతనులు బాగుగా కృషిచేసి గ్రామాలలో ప్రచారకులనుపంపి ప్రజల సంతకాలు తీసుకొని శాసనసభ కంపుచున్నారను వార్తలు వినుచున్నాము. సంస్కార ప్రియులు ప్రత్యేకముగా ప్రచారకులను సనాతనవాదులవలె ఏర్పాటుచేసినట్లు కానరాదు అయినను ప్రజాభిప్రాయము మహాసముదాయము లందే బాగుగా వ్యక్తమగును. అయిదారు ఆంధ్రమహా సభలలో వేల జనము కూడినప్పుడీ సమస్య బాగా వాదోపవాదాలకు గురియై తుదకు ఏయిద్దరో ముగ్గురో తప్ప తక్కినవారందరును బాల్యవివాహ నిషేధమునకు ఏకగ్రీవముగా మహోత్సాహముతో తమ సమ్మతులను ఇచ్చియుండినది ఆ దృశ్యాలను చూచిన వారికి బాగా తెలియును. స్త్రీల సభలలో అంతటను ఇదే విధముగా నిషేధానుకూలమగు తీర్మానాలు జరిగివి కర్ణాటక, మహారాష్ట్ర మహాసభలలోను ఇట్టి తీర్మానాలే జరిగినవి.

అందుచేత నేకాబోలు సనాతనవాదులు ప్రజల సంతకాలకై మంచి కృషి చేయుచున్నారు. కావున మేము సంస్కార ప్రియులైన వారికి తెలుపుట యేమన—పల్లె పల్లెలో సభలు చేయవలెను. పల్లెపల్లెనుండి బాల్యవివాహనిషేధశాసనము చేయుండి అని తీర్మానము చేయవలెను. దానిని ప్రభుత్వానికి పంపవలెను. మహజర్లు సిద్ధముచేసి సంతకములుచేసి పంపవలెను. ఆ మహజరు ఈ విధముగా నుండవలెను:—

> "హైద్రాబాదు సంస్థాన శాసనసభా కార్యదర్శిగార్కి— ఈ దిగువ సంతకములు చేసిన మేము ఇప్పుడు శాసనసభలో ప్రవేశపెట్టబడిన బాల్యవివాహ నిషేధ బిల్లును వెంటనే శాసనము చేయగలరని ప్రభుత్వము వారిని ప్రార్థించుచున్నాము"
>
> (సంతకములు)

అట్టి మహజర్లను "హైద్రాబాదు నగరము, మోతెమద్ మజ్లిసె వజేఖ్వానీ"అను విలాసమునకు పంపవలెను. తీర్మానములనుకూడా సభాధ్యక్షుని సంతకముతో పై కార్యదర్శికి పంపవలెను. సంతకములు దొంగ సంతకములుగా నుండకూడదు. బలవంతముకాని మోసముకాని ఉండగూడదు. చదువురానివారి అంగుష్ఠము గురుతులను వేయించుచో వారికి చదివి చెప్పి అర్థబోధచేసి ఇష్టపడితే గుర్తుపెట్టించి ఆగుర్తు ప్రక్కన అముక వ్యక్తి (ఫలానామనిషి) గుర్తుఅని చదువువచ్చినవారు వ్రాయవలెను.

ప్రజాహిత సంస్థలును, గ్రంథాలయములవారును, స్త్రీలును, యువకులును ఈ సమస్యలో మంచి పట్టుదల, శ్రద్ధ తీసుకొందురుగాక.

## గోలకొండ పక్షపాతం

శ్రీ వంగపల్లి నీలకంఠం అనేవారు సికింద్రాబాదులో ఇటీవలఏర్పడిన "హైద్రాబాదు సనాతనమహాసభ"కు కార్యదర్శిగా ఏర్పడినారు. వీరు ౨౮-౧౦-౪౯ ఫ. నాడు ఉర్దూలో షైపుచేసిన ఒకప్రతిని మాకు టప్పాలో పంపినారు. దాన్ని మాపత్రికలో వేయుమని మమ్ముకూడా కోరినారు. ఆప్రతియందులో—"నోట్- దీని ప్రతులు అన్ని పత్రికలయొక్క సంపాదకులకు పంపబడినవి" అని వ్రాసినారు.

మాకీప్రతి ౧౮ శుక్రవారము చేరినది. ఇంతవరకు వారము దినాలైనది, స్థానిక పత్రికలగు రహబర్, వఖ్త్, సుబే దక్కన్, ముషీర్, హైద్రాబాదుబులెటిన్ అనువానిలో చూచితిమి. ఇంకా పాపమా ప్రకటన పైపత్రికలలోరాలేదు, తక్కిన పత్రికలలో వచ్చినదేమో తెలియదు. లేక ఇకముందీ పత్రికలలోవచ్చినరావచ్చును. చిత్రమేమియును లేదు, పై కార్యదర్శిగారు వ్రాసినవిషయం టూకీగా రెండుమాటలలో చెప్పివేస్తాము.—"గోలకొండ పత్రికా సంపాదకుల వార్తాప్రచారవిరుద్ధమగు నడవడి"— యనది వ్యాసశీర్షిక—లోపలివిషయం—"గోలకొండ పత్రికాధిపతి శ్రీసనాతనధర్మమహాసభయొక్క వార్తలవిషయములో వార్తాప్రచార విరుద్ధపద్ధతి నవలంబించినారు. కాని ప్రతిపక్షులైన ఆర్యసమాజమువారి వార్తలను, బాల్యవివాహనిషేధశాసనానుకూల వార్తలను విడువకుండా ప్రచురించినారు. ౨౨ అమర్దాదునాటి పత్రికలో ఇకముందు బాల్యవివాహ నిషేధశాసన విరుద్ధమగువార్తలను మేముప్రకటించము అని స్పష్టముగా వ్రాసినారు. ఒకపక్షానికి బలముకలిగించి ఇంకొకపక్షమువారి భావాలను అణచివేసినారు"

ఇది ఆందలిసారాంశము. ౨౨అమర్దాదునాటి పత్రికలో "ప్రకటింపబడని వార్తలు" అను శీర్షికక్రింద మా కార్యాలయమువారిట్లు వ్రాసినారు.

"౬ ఆర్యసమాజపు రెడ్డివర్మగారి వింతపుంత. మాడపాటి హనుమంతరావుగారి బెదరింపుల కుమందలింపులు (ఇక ఈ బాల్యవివాహసమర్థనపుచర్చకు సంబంధించినవార్తలనుగాని వ్యాసములనుగాని ప్రకటించజాలము"

ఈవిధరగా వ్రాసినను ౫-౧౦-౪౯ నాటిపత్రికలో సిద్దిపేటసనాతనవార్త విపులముగా ఇయ్యబడెను. మరియు ఈక్రింది సనాతనపక్షపువార్తలుకూడా ౨౨అమర్దాదుతర్వాత గోలకొండలో ప్రకటింపబడెను.

(౧), సనాతన మతప్రచారకుశిరాక

(౨) ,, కార్యదర్శి ప్రకటన,

(౩) వర్ధమానుకూరు మున్నగు గ్రామాలలో సనాతనుల ప్రచారవార్తలు.

౨౨అమర్దాదునుండి తమవార్తలనువేయుటలేదని వ్రాసినారు. అంతకుపూర్వము వారి వార్తలనుబాగుగా ప్రకటింపబడినవనిఅర్థము. యథార్థముగాకూడ ఈసనాతనమండలి ప్రచారసభ ఏర్పాటుచేసిననాటినుండి ౧, ౨౬, ౨౯ తీరుసెల తేదిలలోను ౫, ౮, ౧ అమర్దాదునెల తేదీలలోను ౧౨సనాతనవార్తలకుపైగా ప్రచురింపబడినవి. ఇంతమాత్రమైనను సంస్కారుల వార్తలు ప్రకటింపబడలేదు.

అయితే యింకనుఎక్కువగా సనాతనుల బాల్యవివాహవార్తలను ఎందుకు ప్రచురించలేదని ఆక్షేపించుట సహజమే. అప్పటికే వారివార్తలలో అసత్యమెక్కువగానున్నదను వార్తలుమాకు చేరెను కావునవారివార్తలు, ఖండనవార్తలు, మరల సనాతనులసమాధానము మరల సమాధాన ఖండన ఇవన్నీ వేయుచుండిన మా పత్రికలో ఇక వేరేవార్తలకు తావుండదు.

మేము బాల్యవివాహ నిషేధశాసనానికి విరుద్ధమగుప్రచారము చేయకొల్లమనుటనిజమే. మేము సంఘలోపాలను సంస్కరించుటకై చేతనైన కృషి చేయువారము. మాదృష్టిలో బాల్యవివాహాలు సంఘలోపాలలోచేరినవే. కావున మేము చేసిన ఘోరమగుతప్పు ఏదియునులేదు.

అయితే ఇంతమాత్రానికే పత్రికామర్యాదాతిక్రమగులోపము మాకంటగట్టుటయేల?"వార్తా ప్రచార విరుద్ధమగుపద్ధతి" (గైర్ సహాఫతీరవిష్) అని శ్రీసనాతన కార్యదర్శిగారు మమ్ము నిందించుచు "పత్రికలన్నింటిలో" ప్రచారముచేయుచున్నారే! ఇదేవిధంగా ఏమేమోపెద్దగా మమ్ము ఆక్షేపించుచు కరపత్రాలు అచ్చొత్తి పంచిపెట్టినారనివింటిమి. కానిమాకవి పంపలేదు. మేము వాటిని చూడనూలేదు. ఇట్టి నిందారోపణలెన్నియైనను మాకు భయముకాని ఆయాసముకాని కలిగించనేరవు. మేము చేయునది సరియగు వార్తాప్రచారకపద్ధతియే ఇంతమాత్రము ప్రతిపక్షులనిందలకోర్చి జవాబిచ్చుట కూడ మావిధికాకున్నను చేయుచున్నాము.తప్పకు

## గోలకొండ 'వైఖరి'

శ్రీమాన్ పట్టికోట ఆళ్వారుస్వామిగారును, సాల్వేరు రామయ్యగారును నన్ను పేరుపెట్టిపిలిచి జవాబు అడుగుచున్నారు. "మ. రా. శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్. గోలకొండ పత్రికా సంపాదకులుగారికి" అను శీర్షికతో విషయప్రారంభమైనది. తర్వాత గోలకొండపత్రిక వర్ణన, నా "వర్ణన" ఆంధ్రమహాసభవర్ణనకలదు. అటుతర్వాతి విషయమేమంటే!

"కాని కొన్నాళ్లనుండి దురదృష్టవశమున గోలకొండపత్రిక ఆంధ్రోద్యమమునకు సంబంధించిన విషయములపట్ల వహించుచున్న వైఖరి కొందరికి అపోహములకు కారణమైనది.

"౧. ౨౬-౧౦-౪౯ వాటి పత్రికలోవి బహిరంగలేఖలో "ఆంధ్రమహా సభాధ్యక్షులవింత వైఖరి" "కార్యకారిణీ సభవారిపక్కతాళం" అనువాక్యాలుకలవు. బహిరంగలేఖ ఎన్నిమారులు చదివినను పైవాక్యములు దొరకలేదుకాబట్టి అవి బుద్ధిపూర్వకముగా సంపాదకులవారిచే ఉపయోగింపబడినటుల చదివిన ప్రతివారికిని స్ఫురించకపోదు,

"౨. ౨౬-౧౦-౪౯ తేదివాటి పత్రికలో ప్రకటింపబడని వ్రాతలలో "హిందూప్రజామండలి కార్యదర్శిగారికి బహిరంగలేఖ కలదు......

......ఇట్టిముఖ్యమైన సమస్యపై అన్నివిధములైన అభిప్రాయములు ప్రకటించినచో ఇదమిత్థమని నిర్ణయించుకొనుట కవకాశముండునని మనవిజేయుచున్నాము."

నచ్చినవార్తలను—అవి ఎన్నికట్టలున్నను అకట్టివైనను—అబద్ధంవా సుబద్ధంవాఅయినను—ప్రచురించుటరేమనా సరియగు వార్తాప్రచారపద్ధతి.తమకనుకూలమగుపత్రికయగు దివ్యవాణిలో శ్రీసనాతనమహాసభావృత్తాంతాలు నిండుగావచ్చుచున్నవికదా! తద్వ్యతిరేకవార్త ఒక్కటైనను ప్రచురింపబడెనా? ఇంతపెద్ద తెలంగాణాలో మరట్వాడాలో అందరును బాల్యవివాహాలనే కోరిరా? నిషేధశాసనము కావలెనన్నవార్త ఒక్కటైన దివ్యవాణికిదొరకలేదా? అట్టివార్తలప్రకటించవందున దివ్యవాణివార్తాప్రచారవిరుద్ధపునడవడిక కలదని అనవలసినదేనా? అయినా యాదిక్కులేని "తెలంగీ" గోలకొండలో సనాతనుల బాల్యవివాహవార్తలు ప్రచురింపబడకపోయిన నేమాయె? రహబర్,సుబేదక్కన్ వంటిఉర్దూపత్రికలు సనాతనుల వార్తలనే ప్రచారముచేసెనుకదా! సంస్కారులవార్తలకు స్థానమిచ్చినట్లేలేకపోయెను కదా! ఇంకేమికావలెను. పలుకుబడికలపత్రికలు, అందులో ఉర్దూపత్రికలు, పైగాదినపత్రికలు, ఇంకాఏమైనా అంటేనేరుగా ప్రభుత్వమువారు చూచుకునే పత్రికలు, మాసనాతన సోదరులకాశ్రయ భూతములైనందులకు సంతోషించుచున్నాము.

ప్రతిపత్రికకున్నూ ఒకఆదర్శముండును. దివ్యవాణికేవలముసనాతనవాది, రహబర్ ముస్లిం ప్రాధాన్యతవాది, ముస్లింపత్రికలలో హిందూ మహాసభప్రచారముకానేరదు. అందుచేత అవివార్తాప్రచారవిరుద్ధపునడపడికలుకలవికానేరవు. ఆర్యసమాజపత్రికలు నవాబహద్దరుయార్జంగు బహద్దరుగారిఉపన్యాసాలకు "షాబాష్" "ఆమీన్"అని స్వాగతమియ్యనేరవు. కాంగ్రెసుపత్రికలు బ్రిటిషుసామ్రాజ్యాన్ని స్తుతించునా? లేకఆంగ్లోయిండియన్ పత్రికలు కాంగ్రెసుచర్యలనన్నింటిని శ్లాఘించునా? కావున మేముచేసిందానిలో తప్పులేదని సనాతనమహాసభా కార్యదర్శిగారెరుగుదురుగాక, వారికిమాకునుఈబాల్యవివాహవిషయములో ఆదర్శభిన్నముపూర్తిగాకలదు వారినిందలకు జంకముమరెవ్వరైనా పత్రికాంతరములో మమ్ము బూతులతో సంభావించుచున్నారే? యింకెట్లు? అనిద్ధరిల్లి మావిశ్వాసములనువదలుకోము. సనాతనులు తమకృషిఫలితముగా బాల్యవివాహనిషేధశాసనాన్ని పడగొట్టించి యెత్తిపారవేయించితేవారిశ్రమకు, వారిశ్రద్ధకు మేమున్నూ సంతోషింతుము. దేశములోఇంకనుప్రబోధముకాలేదని తలతుము.

ఈబాల్యవివాహముపైననే హిందువుల అభివృద్ధిఆధారపడలేదు. హిందువుల పతనానికెన్ని అంశాలు అంగోపాంగాలు. కార్యకలాపాలుకావలెనో అవన్నీ సిద్ధమైనవి. అవుచున్నవి. కాగలవు. అట్టివాటినిగూడ దృష్టిలోనుంచుకొని మాసనాతనసోదరులు శాంతబుద్ధితో. కేవలము అంతఃకరణమునేసాక్షిభూతముగా చేసుకొని హిందువుల భావిభాగ్యోదయమునకై పాటుపడుదురుగాక.

## హరికేజనిధి

హైదరాబాదు(దక్కన్), ఆగస్టు౬. పైనిధికి ఆగస్టు౧వతేదినాడు కల్దారు రూ. ౫౦౨-౪-౦లును, హాలీరూ౫౫౯౧-౧-౦లును, ఆగస్టు ౩వతేదినాడుకల్దారులో౫౬౫-౧౦లును హాలీరూ౧౬౦౩౯-౧౫-౧లును, ఆగస్టు ౪వతేది నాడు కల్దారురూ౧౦౦-౪-౦౬ను: హాలీ రూ౨౫౩౬-౪-౮లు వసూలైనవి. ఈవిధముగా నింతవరకు మొత్తము కల్దారురూ౬౪౫౩౦-౩-౧౦లును హాలీరూ౨౫౨౨౯-౯-౬లు వసూలైనవి.

ఇందులో పెద్దమొత్తాలు "ప్యాలెస్ టాకీ"లో "ఖాబీ" చిత్రప్రదర్శనము టిక్కెట్లఅమ్మకములోవచ్చిన మొత్తముహాలీ రూ౧౦౫౦లు ఈనిధికి ఇవ్వబడినవి. అమరచింతసంస్థాన కార్యాలయమునుండి హాలీరూ౩౧౦లు, జటప్రోలుసంస్థానపు సురభి రాజా వెంకట జగన్నాధరావుగారు హాలీరూ౧౪౦లు, ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థుల యూనియన్ వారు విద్యార్థుల మక్కీజాలో మిగిలినమొత్తమగు హాలీ రూ౧౫౦లును, ఇచ్చియున్నారు.

---

ఈయుభయులు వ్రాసినజాబులోని ముఖ్యాంశాలను లోపములేనట్లుగా ఉదహరించినాను. ఈజాబు ధోరణిచూడగా నేను ఆంధ్రమహాసభకు వ్యతిరేకమగుదానిని దాచిపెట్టినానని ద్యోతకమగును. మరియు "బుద్ధిపూర్వకముగా" పక్షపాతము చేయుచున్నానియును ధ్వనించుచున్నది. అడిగిన రెండుప్రశ్నలకు సమాధానము మనవిచేసుకొంటున్నాను.

౧ బహిరంగలేఖలోని శీర్షికోపశీర్షికలగు "ఆ. మ. అధ్యక్షుల వింతవైఖరి" "కా. కా. వారి ప్రక్కతాళం" అనునవి మాకల్పనలుకావు. అవియు బహిరంగలేఖలోని భాగాలే. దానిని వ్రాసినవారే పెట్టిపంపినారు. అయితే నేనిమాటచెప్పితే మా శ్రీమాన్ ఆళ్వారుస్వామిగారు నమ్మకారేమో. ఎందుకంటే వారే యీజాబునువ్రాసినట్లు వారిద్వారా చెప్పుకొంటున్నది. వారేదీనిని మాకార్యాలయంలో స్వయంగా ఇచ్చిపోవ్వుటను వహించినారు. నేను ఆనిసమయములో దానినిచ్చుచు మాప్రూఫ్ రీడరును "ఏమండీ, యీహెడింగులు మీరుపెట్టినవాకావా?" అని అడిగినారట. "ఏమోనండీ నాకు తెలియదు" అని మా ప్రూఫ్ రీడరుఅనగా ఒక చిన్న నవ్వునవ్వి పోయి నారట! మిత్రులగుస్వామిగారును, శ్రీసాల్వేరు రామయ్యగారును, మరియు యీశంకకు సంబంధములవారును, లేనివారును, అందరును, ఎవరుపట్టితేవారు మాకంపడిన బహిరంగలేఖను కండ్లార తిలకించిపోగలరు. ఆటుపై యింకేమైనా శంకాశేషము మిగిలియుంటే బహిరంగలేఖవ్రాసిన ఆ ముగ్గురివ్యక్తులనుగూడ విచారించుకొనవచ్చును. వారుసత్యమే చెప్పగలుగుదురు.

౨ ఇక రెండవప్రశ్నకు సమాధానము చెప్పటకన్న ప్రకటించక నిరోధించియుంచిన లేఖను పూర్తిగా నిందు ఉదహరింతును.

"బహిరంగలేఖ,

హిందూప్రజామండలి కార్యదర్శిగారి అయ్యా, తాము మొన్న గోలకొండ పత్రికలో ప్రకటించిన్న వార్తచాల ప్రసంశనీయముగావున్నది. హిందూప్రజామండలివారు చేయుచున్న ముగ్ధచిపనిని యిప్పటి ఆంధ్రమహాసభ అధ్యక్షులు కారణములేకుండ ఆక్షేపణలుచేసినందుకు ఆంధ్రులకందరికిని తలవంపులు గావున్నది. వీరిని యవ్వరుయెన్నుకున్నారో ఇట్టిపనులకే యన్నుకున్నారేమో తెల్వదు. కామేవ్వరూ మీరుచేయుచున్న సేవను ఆశీర్వదించిహిందువులకు సేవచేయుటాచక్కగలరు"

జాబును ఉన్నదున్నట్లు ప్రకటించినాను ఈజాబుపై నేను ఇంగ్లీషులో ఈవిధంగా శ్లాక (నోట్) వ్రాసియుంచియుంటిని.

"No Signature, cannot be printed· Rejected. S.P.R.

25-10-49 f.

ఈ జాబునే మాకార్యాలయమువారు ప్రకటింపబడని వ్రాతలలోపడివేసినారు. ప్రకటించుట ఉచితమా అనుచితమా ఇప్పుడుమాన్యులు బాగుగా గ్రహించుకోగలుగుదురు. ఈ జాబుమూలమునుగూడ ఎవ్వరైనను కోరుకుకు సీ ఐ డీ. వారును చూచుకొని పోవచ్చును.

"గోలకొండవైఖరి" సరిగానేయున్నది. ఈ "కొన్నాళ్లనుండి" మారలేదు. మారేవారు మారుతూనేఉందురు. గోలకొండపత్రికమాత్రము మారితే దేశాభ్యుదయానికవసరమగు విధానమునకే మారగలదు.

చిత్తగించగలరని ప్రార్థించుచున్నాము.

— సురవరము ప్రతాపరెడ్డి

సమకాలికాభిప్రాయములు

## బాల్యవివాహ నిరోధ చట్టమునకు సనాతన సుడిగాలి

ఇప్పటికి రెండుసంవత్సరములకు పూర్వము నైజాము సంస్థానమునందు హిందూవితంతువివాహము చట్టసమ్మతమైనది. తిరిగి అట్టి వేరొకసంస్కరణమును పొందగలుగుభాగ్యము హైదరాబాదు హిందువులకు కలుగనున్నది. బాల్యవివాహముల నరికట్టుటకొక చట్టమునుచేయు సంస్థానము తలపెట్టి పనిచేయుచున్నది.

"నైజాము సంస్థానమునందు హిందువులలో అతిబాల్యవివాహము లతిమిక్కుటముగ జరుగుచున్నవి. అందు బ్రాహ్మణాది అగ్రకులములందు విపరీతముగ వృద్ధిజెందియున్నది. బ్రాహ్మణేతరులందే యతిబాల్యవివాహము లున్నప్పటికిని, కొందరిలో వితంతుబాలికలకు పునర్వివాహములు జేయు నాచారమున్నది. బాలికలకు యుక్తవయస్సు రాకముందే ఇట్టి పునర్వివాహములు రెండుమూడుకూడ జరుగుచున్నవన్న, యీ బాల్యవివాహ పిశాచమెంత విలయతాండవము జేయుచున్నదో యూహించవచ్చును,

బాల్యమునందే వితంతువైన బాలికకు తిరిగి బాల్యవివాహమునే గావించుతల్లిదండ్రుల దురాచారతమస్సునందు వివాహమునకు పవిత్రత యెక్కడ?

ఇక నీపునర్వివాహము లాచారములందులేని బ్రాహ్మణాది కులములందలి వితంతుబాలికల దుర్భరజీవనములు, హాహాకారములు సంఘమునవినీతికూపముగ జేయుచున్నవి.

ఇట్టియవినీతిని, అశాంతిని వెనుకనిడుకొని ఇట్టిశాసనమువలన హైందవమతము గంగలో కలియుచున్నదనియు, దానిని రక్షించుటకను నెపముతో, ఆచారముపేర, మతముపేర యీశాసనమును నిరోధించుటకు సనాతనప్రముఖులు తీవ్రప్రయత్నములతో దాడిసల్పుచున్నారు.

జీతములను, దినసరి బత్యములనుకూడ నిచ్చి కొందరిచే ప్రతిపత్తియందును ప్రచారము గావించు విపరీతములకుకూడ వీరు సంసిద్ధులగుచున్నారనిన, వీరి యవివేకమునకు, మూర్ఖతకు పారముగలదా? వీరి యజ్ఞానతిమిరమును పారద్రోలు జ్ఞానప్రభాతము ప్రసాదింపబడుగాక యని కోరుట దప్ప నేరేమిచేయగలము?

అసలు స్వదేశసంస్థానములను సంస్కరించుట యనునదొక సంస్కరణే. చాలకన్నా వ సాంఘిక పునర్నిర్మాణమును గావించుకొనుచు, నవయుగనిర్మాణమునకై జాతి ముందుకుపరువులెత్తు చుండ సంస్థానములందు మచ్చుకేని ఇట్టిచైతన్యము గానరాదు. ఎన్నడో వచ్చియుండవలసిన యిట్టిసంస్కరణములు ఇప్పటికైనవచ్చినప్పుడు హర్షముతో పలసినదిపోని అగ్రహముజూపుట ఏటివివేకము!

స్వదేశసంస్థానములందు అగ్రస్థానము వహించిన నైజాము సంస్థానమునందిట్టివి ఇంకను కానందుట శ్రేయస్కరము గాదు.

బాల్యవివాహచట్టము నిర్మించినగాని జనుక టివితంతువివాహచట్టమునకు తగినబలము సమకూరదు. కాన వెనుకటి చట్టసందర్భమునవలె యిప్పుడుగూడ యీసనాతన సుడిగాలిని ప్రజలు, ప్రభుత్వముకూడ ఎదుర్కొని హింసాకూపమున బడిపోవుచున్న బాలికల నుద్ధరింతురుగాక! ప్రభుత్వము ఇందుకుతగిన శ్రద్ధబూని సనాతనుల చాంధసమును విస్మరించి, చట్టమును త్వరలో ప్రసాదించును గాకయని విశ్వసించుచున్నాము.

—గృహలక్ష్మి

## పుష్టికర ఆహారములేక కృశించుట

ఇట్లుండియు ఏ ఆహారము భుజించుటలేదు, జ్వరపీడితులకు తిరిగిశక్తిని చేకూర్చుటెట్లు? జ్వరప్రభావము దేహమంతటను వ్యాపించి, నరస్నాయువులను బలహీనముగాజేసి, జీర్ణశక్తినితగ్గించును, అందువల్ల ఆహారపుమాట ఎత్తిన అసహ్యపడును. తినుకొన్న ఆహారము వాంతియగును. ఇటువంటి స్థితిలో తగు ఆహారములేకపోయిన రోగులు శక్తిని సంపాదింపలేరు.

హార్లిక్సు ఇట్టి ఆహారమని డాక్టర్లుకనిపెట్టినారు. ఇది ప్రాణాధారమైనది. జీర్ణశక్తికి ఏలాటి హానికలుగజేయదు. సులభముగా జీర్ణమైసకలావయవములకుశక్తినిచ్చి, నూతనస్నాయువులను వృద్ధిపరచి, స్వల్పకాలములో ఆరోగ్యమునుచేకూర్చును. వారు బ్రతుకుటకు హార్లిక్సే కారణమని చెప్పవచ్చును. ఇందుకుగాను పెద్ద ఆస్పత్రులలో జ్వరబాధితులకు హార్లిక్సును ఇచ్చు ఏర్పాటు చేసినారు.

## సంస్థానాల ప్రజలు

డా. పట్టాభిగారి సంపాదకత్వమున వారపత్రిక

బొంబాయి, అగస్టు ౧

భారతసంస్థానాల ప్రజలసభ స్థాయిసంఘసభ జూలైనెల ౩౧వతేదీ మధ్యాహ్నం ౨గంటలకు పూనాలో కాంగ్రెసుభవనములో జవహరలాలుగారి అధ్యక్షతక్రింద జరిగినది. డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యపంతులు, సేటు జమ్నలాలుబజాజు, మియాను ఇఫ్తికరుద్దీను గార్లున్ను కార్యదర్శులు బలవంతరాయి మెహతా, జయనారాయణవ్యాసు రంగీల్దాసు కపాడియాగార్లును, ఇతరులును వచ్చిరి. జవహరలాలుగారు మొట్టమొదట అన్నివిషయాలనుగురించి సింహావలోకనముచేసిరి ఒక వారపత్రికను ప్రకటించవలెనని సూచించిరి. సభవారి ఆర్థికస్థితిని బజాజుగారు వివరించిరి. డాక్టరు పట్టాభిగారు గూడ చర్చలో ఎక్కువగా పాల్గొనిరి

కే బి, మీనను గారిని కార్యాలయ కార్యదర్శిగాను, కృష్ణశర్మగారిని ఆర్గనైజింగు కార్యదర్శిగాను, సభవారు నియమించిరి.

"సంస్థానాలప్రజలు" అనుపేరుతో ఒక వారపత్రిక ప్రకటించబడును. దీనికి డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు సంపాదకులు గానుందురు.

## ఇండియావైపునకు జపానువ్యాప్తి

"క్రా"కాలువ నిర్మాణపు ఆలోచ

లివప్పూలు నగరమునకు "డెయిలీరిపోర్టు" అనుపత్రికలో సైనికవ్యవహార పరిశీలకుడు ఇట్లు వ్రాసినాడు:—

ఇది బ్రిటనుకు కష్టకాలము. దీనిని స్వలాభమునకు వినియోగించుకొనుటకు జపాను అయిష్టపడుటలేదు. తూర్పు ఆసియా తనకు అధికారమున్నదని తిరిగి గట్టిగాపల్కుట క్రొత్తసంగతి గాకపోయినను, రష్యాకు, అమెరికాకు సంబంధించినంతవరకు క్రొత్తవాతావరణ మేర్పడుచున్నది. పసిఫికు సముద్రమునుండి విదేశీయుల పలుకుబడిని, విదేశీయులసొత్తును తొలగించుటమాత్రమే జపానీయుల సంపూర్ణఆశయము గాదు. ఇండియా మహాసముద్రములో తనవ్యాపారమునకు బలముగా తనపతాకమును ఎగరవేయుచుండవలెనని అనగా రాజ్యాధికారము సంపాదించవలెనని జపానుకోరిక. జపానువ్యాప్తి ఇండియాకు సైన్యసంబంధమైన వ్యవహారము ఏలన పశ్చిమమైనా ఆక్రమణద్వారా జపానువ్యాపారమునకు బర్మారోడ్డు మార్గమిచ్చును. ఈవిషయమున భారతీయులందరు రక్షణావసరమును గుర్తించియున్నారు. జర్మనువిజయము ప్రాచ్యఖండమున ఉపద్రవమును ఎక్కువచేయునని వారికి తెలుసును.

ఇండియా మహాసముద్రములోనికి కంట్రోలు ద్వారముగా నుండునట్లు సింగపూరు ఉద్దేశింపబడినది. అదిఇప్పుడు గట్టిగానుండుటవల్ల దూరప్రాచ్యశాంతి చాలా మేలుగానున్నది. జపాను వ్యాప్తిజరుగకుండ చేయుటకు అది ఉద్దేశించబడినదని జపాను చాలఆగ్రహముచూపినది.

సింగపూరు ప్రయోజనమును తగ్గించుటకు జపానుతంత్రజ్ఞులు ప్రయత్నించుట సహజమే. అయక్ష్నము యుద్ధమునకుముందు సయాంతో మైత్రిచేసికొనురూపము దాల్చినది. ఇందులో ఒక ప్రత్యేకోద్దేశ్యమున్నది. క్రాజలసంధి ప్రాంతం సయాం ఇరుకుభాగములో కాలువత్రవ్వ వీలగునని జపాను ఇంజనీర్లు అనుకొన్నారు. సింగపూరుకు వెనక, దానినితప్పించి జపానునావలు వేరుగా దక్షిణచైనా సముద్రమునుండి ఆ కాలువద్వారా"బంగాళాఖాతము" సముద్రములోకి ప్రవేశింపకలుగును.

ఇటీవల ఈసంగతినిగురించి ఏమంత తెలియుటలేదు, కాని ఇండోచైనాకు త్వరగా చేరుమార్గముండునని ఫ్రాన్సు అందులో శ్రద్ధతీసుకొన్నది. ఇప్పుడు నాజీభాతృత్వమున కనుబంధ పశ్చదేశముగా ఫ్రాన్సుకు జపానుకు ఎక్కువ సన్నిహితసంబంధము ఉండును. గాన ప్రస్తుతపుతగాదాలో ఈఅంశమును బర్మా నేలమార్గము పటములో చూచి గమనించగును.

కాలువత్రవ్వుటకంటె సయాంద్వారా రైలువేయుట సులభము. ఇండియా మధ్యప్రాచ్యదేశములలో జపానుగుప్పించగల సరకులధర తగ్గునని కొందరు జపానీయులు అనుకొందురు. కాలువత్రవ్వతారో, రైలువేస్తారో, ఏదిజరిగినను సరే వ్యాపారము పెంబడి పతాకమునడుచును, కాబట్టి ఇండియా మహాసముద్రములో జపాను యుద్ధనౌకలు విహరించునని వారిఆశ.









Saba & Co.

## బాల్యవివాహ నిషేధము

ఖమ్మం పౌరులు కావలెననుచున్నారు
వ్యతిరేకులు ఇద్దరే ఇద్దరు

(ఒకవిలేఖరి)

ఖమ్మంమెట్టు, షహరేవరు ౨౮

దిll ౨౫-౭-౪౦ న సాయంత్రం ౫ం. ౘలకు శ్రీయుత మందుముల నరసింగరావుగారిచే శాసనసభయందు ప్రవేశపెట్టబడిన హిందూబాల్యవివాహ నిరోధకచిత్తుచట్టముపై అభిప్రాయము తెలుపుటకు హిందూపౌరుల సమావేశము శ్రీయుత అకులపూర్ణానందంగారి అధ్యక్షతన ఆర్యపల్లివారి "హొత్మలక్ష్మివిలాస్" సత్రమునందుజరిగినది ప్రార్థనతరువాత సభసమావేశకర్త అగు శ్రీకోదాటి నారాయణరావుగారు సభాధ్యక్షతకుఅకులపూర్ణానందంగారిని సూచించగా శ్రీపసుమర్తి వెంకట లక్ష్మయ్యగారుబలపరచిరి. సభఅంతయు ఆమోదించినది. పూర్ణానందంగారు అధ్యక్షతవహించిరి.

ఊట్కూరి వెంకటరామారావుగారు "శ్రీమందుముల నరసింగరావుగారిచే శాసనసభయందు ప్రవేశపెట్టబడిన హిందూసంఘపరిస్థితులననుసరించి అత్యావసరమని భావించుచు సత్వరముగా ఈచిత్తుచట్టమును శాసనమొనర్చుటకు శాసనసభసభ్యులుసభవారకోరుచున్నారు" అనుతీర్మానమును ప్రవేశపెట్టిరి. శ్రీకేశవార్యశాస్త్రిగారు దానిని బలపరచిరి. మద్దిపిచ్చయ్య, యస్ పాపారావుగార్లు తీర్మానమునకువ్యతిరేకముగా మాట్లాడిరి పి. రంగ, పసుమర్తివెంకటలక్ష్మయ్య, కొమరగిరి నారాయణరావు, కోదాటినారాయణరావుగార్లు శాసనమునకనుకూలముగామాట్లాడిరి, ఎన్ని సారులుఅవకాశమిచ్చినను ప్రతికూలముగా చెప్పువారెవరునుముందుకురాలేదు. అనుకూలముగా మాట్లాడుటకు చాలామందికోరినను అనవసరమని భావించుఅవకాశమీయలేదు.

అధ్యక్షుల సమీక్షతర్వాత దీనిపైసమ్మతులు తీసుకొనబడినవి. మొత్తం సభ్యులసంఖ్య ౨౫౦ తీర్మానమునకనుకూలముగా ౧౬౦ మంది ఓటుచేసిరి. ప్రతికూలముగా ౨ మాత్రమే. మిగతాసభ్యులలో శాసనమునకనుకూలించుచున్నను స్వల్పమగుసవరణలనుకోరువారగుట చేతటస్థులుగానుండిరి. ఈతీర్మానమునుఅధ్యక్షులవారు శాసనసభకు పంపుటకు అధికారమీయనైనది. ఇంతటితో రాత్రి ౯ం ౫-౩ం లకు సభముగిసినది.

## సిరిసిల్ల తాలూకాలో వింతలు

(స్వ వి.

సిరిసిల్ల, షహరేవరు ౨౬

సిరిసిల్లతాలూకాలోచేరిన వట్టిమల్ల గ్రామములో ఒకమంగలవానికికొకశిశువు జననమొందెను ఏడాదిశిశువాయెను. ఇంతవరకు ఆడవా, మొగవాడా తెలియకున్నది. మర్మస్థలములో రెండు గుడ్లు వాట్కిందచిన్నరంధ్రము మూత్రవిసర్జనకుకలదు. తల్లిదండ్రులకు ఏమితోచకున్నది.

మనిషి నెమరువేయుట

సిరిసిల్లతాలూకలో చేరిన కోనారావుపేటలో ఒక ౭౦ పుసులవృద్ధుడుభోజనముచేసినతరుక రెండు మూడుగంటలకు నెమరుపెట్టి పదార్థము యొక్క రుచికనుగొనుచు. రాళ్లుగింజలున్న ఉమ్మివేయును. నీళ్లుత్రాగి రెండుగంటలతర్వాత కావలయునన్న కడుపులోనుంచి బయటతీయును.

## బహద్దరు యార్జంగుగారి రాక

జనగామ, ఆగస్టు ౨

ఇచ్చట మునీర్ అహమదుగారి కూతురు వివాహసందర్భమున వీరుఇచ్చటికి (౧-౨, గంటలకు (పగలు) దయచేసిరి. వీరురాగానే ఇక్కడి మహమ్మదీయులందరుకలిసి వీరిని మసీదులోకికొనిపోయిరి. ఇందులో సుమారు (౧౫౦)మంది పాల్గొనిరి వీరుఅందరునుకలిసి అరగంటసేపుసమాజా చెసినతర్వాత నవాబుగారు "మనము ఎప్పుడైనను ఐకమత్యముగా ఉండవలెను.

మనలో చిన్న పెద్ద అనేభావము ఉండగూడదు. మనము౫మాటులు దేవుని స్మరించవలెను" అని యుపన్యసించిరి. ఇక్కడినుంచి వీరు ౪గంటలకు హైద్రాబాదు వెళ్లి.




## హరికేక్‌చందానివిపసూళ్లు

(ఒ.వి.) భువనగిరి, షహరేవరు ౨౫

ఇక్కడ గత౨౯-సందికలో యుద్ధనిధి చందాలు వసూలు చేయుచున్నట్లు తెలుపబడియుండెను. తర్వాతజరిగిన విషయములు;

చందాలువసూలు చేయు గుమాస్త పట్వారి పటేలు కావలివారలయుక్తముగా అల్లాడిమల్లయ్యగుప్త గారిఇంటికి చందాకుపోయిరి. అందుపై గుప్తగారు సేటు రాందయాలుగారు[హిమాయతు గంజ్‌సర్ పంచు) ఇవ్వుచున్నారు. ఇక్కడ (గ్రామం)లో ఇవ్వననిరి, అందుపై వసూలు కునిందాలు గుప్త గారిని అనరానిమాటలచే దూలవాడి నిర్బంధముచేసినారు గుప్తగారు ఎంతమొండిపట్టుపట్టినా ఇవ్వకమాత్రము తప్పినదికాదు ఇదేవిధముగా శ్రీయుత అల్లాడినారాయణగుప్త గారికికూడ నిర్బంధము జరిగినట్లు తెలియుచున్నది. ఇట్టినిర్బంధములు దువ్వం తాలూక్దారు గారికి అలిసి విశాబోలు, చందాలు నిర్బంధముగావసూలుచేయుగూడదని సెలవిచ్చినట్లు ప్రస్తుతము చందావసూల్ చేయుటను మానుకున్నట్లు తెలియుచున్నది.

శ్రీయుత కాచంశివ్వయగుప్త (గ్రామసర్ పంచు)గారిమాత్రము చందానిచ్చు సభ్యులు వీరిని ఎవరు సర్ పంచుచేసినారనియు యింకా యేమేమో ఆక్షేపించుచున్నారు.

ఇతరపంచుల విషయములను కొద్దికాలో గొప్పగాలో ఆక్షేపణలున్నవి ఇట్టిప్రజాపాలుకుబడిలేని పంచుకమేటిని ఎవ్వరునిర్ణయించిరో ఒకవేళ్ల ప్రభుత్వాధికారులు నిర్ణయించిన అనుగ్రహించి ప్రజలమన్ననలను బొందువారినే పంచులగానిర్ణయించ ప్రార్థన. ఎట్లన హిమాయతుగంజులో సేట్ రాందయాలుగారు (సర్ పంచు) వారిని నిర్ణయించినారు మీరు. సేటు గారుమాత్రముగంజలో పక్షపాతములేక న్యాయముచేయుద్ధనిధిచందాలువసూలుచేసి ప్రజలమన్ననకు పాత్రుడైనట్లు తెలియుచున్నది.

గతపత్రికలో పుకారుఅఖిమ్మ ప్రదర్శింపబడునని తెలుపబడియుండెను. పైకేలుండొరకనందున-ఖాన్‌బహద్దురుఅను ఫిల్ముకీలుం ప్రదర్శింపబడెను ఆదేరోజు అబ్కారికాంట్రాక్టు అగుటనువలన అనుకున్నంతదానికన్న ఎక్కువ [౭౦౦]రూపాయలకుపైబడి అమ్ముబడినట్లు తెలియుచున్నది.

ఇక్కడి గ్రామకవాలములో ప్రతిసంవత్సరము శ్రీకృష్ణజన్మాష్టమినాడు (ఊరేగింపు) జరుగుచుండెను. ఈసంవత్సరము ఫిర్యాదులన్న కారణముచే చందాలువసూలుకావనియు విద్యుత్సాహముగా ఉత్సవకార్యములుమానుకున్నట్లు తెలియుచున్నది గావకార్యనిర్వాహకులు అభిమానులుశ్రద్ధగొని భగవత్కార్యము సఫలముగావించి భగవత్కృపకు పాత్రులయ్యెదరు గాకయని ప్రార్థన.

## స్టాండర్డు సర్క్యులర్ టూర్ నెం. 10

1 ఆగస్టు 1940 నుండి మార్వాడర్డ్ సర్క్యులర్ టూరు నెం, 10లో పండరిపురముకూడా కలిసివచ్చునట్లు ఏర్పాటుచేయబడినది. ఈమార్పువలన యీటూరువందు యీక్రిందిస్టేషన్లు వచ్చును.

హైదరాబాదు యం.జి, శికింద్రాబాదు, బేగంపేట, వాడి, పండరిపురము (కురుడ్వాడిద్వారాతిరిగి నురల కురుడ్వాడి రకు)

ధోం , పూనా, బొంబాయి వి.టి. నాసిక్‌రోడ్. మన్మాడ్, ఔరంగాబాదు శికింద్రాబాదు, హైదరాబాదు యంజి. లేక బిజి

| చార్జిలు | | రు.అ.పై |
|---|---|---|
| 1వ తరగతి | పెద్దలు | 87- 5-0 |
| | పిల్లలు | 43-10-0 |
| 2వ తరగతి | పెద్దలు | 45- 9-0 |
| | పిల్లలు | 22-13-0 |
| 3వ తరగతి | పెద్దలు | 14- 8-0 |
| | పిల్లలు | 7- 8-0 |

ప్రస్తుతము హెచ్చింపుచేయబడిన చార్జీలుకూడ వీటికిచేర్చబడును.

యితరవివరములకు:-

ది చీఫ్‌కమ్మర్షియల్ మేనేజరు

హెచ్.ఘ.వ. నైజాంస్టేటురైల్వే, శికింద్రాబాదు.

# చార్మినార్ సిగరెట్ల సైకిళ్లబహుమతి

యీక్రింది క్రొత్తబహుమతి నెంబ్లరు 20 జులై 1940

(14 షహరేవర్ 1349 ఫ.) నాడు ప్రకటింపబడినవి.

| | | | |
|---|---|---|---|
| ED 97826 | ED 35662 | EI 95911 | EI 92033 |
| EJ 63525 | EK 52391 | EK 17425 | EL 00278 |
| EL 04322 | EP 86704 | EX 59706 | FJ 29192 |
| FM 86523 | FQ 67851 | FX 39118 | FU 43109 |
| | FV 01478 | FW 97743 | |

గెలుపొందిన యీక్రింది నంబర్లవారు యింకాతమ బహుమతులు పొందలేదు

| | | | |
|---|---|---|---|
| AA 05907 | AC 60474 | AC 95741 | AI 21811 |
| AK 33603 | AM 15610 | AM 29355 | AM 83674 |
| AQ 65136 | AV 36803 | AV 36905 | BC 16162 |
| BC 19526 | BF 46655 | BG 75480 | BK 12233 |
| BM 67405 | BQ 24932 | BR 15993 | BS 11728 |
| BT 86954 | BU 19580 | BW 26801 | CA 90068 |
| CB 66553 | CC 90756 | CE 72972 | CF 56950 |
| CH 37309 | CH 67648 | CH 36330 | CI 07608 |
| CI 95825 | CK 79033 | CL 36045 | CN 12990 |
| CS 03771 | CV 14243 | CV 97037 | CX 00176 |
| DF 70122 | DF 72612 | DF 72738 | DF 73296 |
| DF 97828 | DH 10635 | DI 25740 | DM 51824 |
| DM 59970 | DS 66551 | EA 68494 | EA 56274 |
| EA 93901 | EC 66336 | FB 26697 | FC 43154 |
| FC 44355 | FH 76822 | FI 53648 | FJ 59216 |
| FR 35911 | FR 86089 | FR 25000 | F3 70078 |
| FU 18213 | FW 18236 | | |

# నెంబరులులేని టిక్కెట్లు అంగీకరింపబడవు

141 బహుమతిసంఖ్యలు యింతవరకు ప్రకటింపబడినవి.

గెలిచిన నంబర్లవారందరు 30 ఆగష్టు 1940 (24 మెహర్ 1349 ఫ.)లోగా తమ సైకిళ్లను పొందవలయును.

Saba and Co.

# నైజాము ప్రజలకు హెచ్చరిక

నైజామునకును, బ్రిటిషునకును వీ.పి. పద్ధతిలేకపోవుటచే మా అనుభూతమందులను, యితరమందులను గ్రంథములను తెప్పించుకొనుటకు యిబ్బందిపడుచూ అనేకమంది కోరుటచే యీక్రిందివారిని నైజాములో మాస్టాకిస్టులుగా యేర్పాటుచేసితిమి కావున నైజాముప్రజలకు యీవిషయము తెలియపర్చడ మయినది,

స్టాకిస్టులు:—మధిర డాక్టరు రామగోవిందం.
,, ఖమ్మంమెట్టు:-బొమ్మిడి రామకృష్ణయ్య సన్సు.
,, వరంగల్లు:-రవ్వాలింగయ్యగారు, లేక కుమారా ప్రింటింగ్ వర్క్సు.
,, శికింద్రాబాదు:-మూల్‌చంద్ అండ్ కో, స్టేషన్ రోడ్.
,, హైదరాబాదు:-కింగ్ అండ్ కో.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# జీ. రఘునాథ్‌మల్ బ్యాంకర్

బ్రాంచీలు:-హెడ్ ఆఫీసు: చాదర్ ఘాటు టెలిఫోన్ నెం. ౨౪
పత్తర్ ఘట్టి ,, ,, ౨౦౮
సికింద్రాబాదు ,, ,, ౮౧౧

ఏజంట్లు:-మెసర్స్-థామస్‌కుక్ అండ్ సన్సు ఇన్కార్పొరేటెడ్.
అమెరికన్ యెక్స్‌ప్రెస్ కంపెనీ, కరెస్పాండెంట్సు, ఏజంట్లు

ఏజన్సీలు:-లండన్, న్యూయార్కు బొంబాయి, కలకత్తా, మద్రాసు, ఢిల్లీ, ఆగ్రా, లక్నో, అలీఘడ్, అల్హాబాదు, కాన్పూర్, కరాచి, సూరత్, పూనా, అహమదాబాదు, బనారస్ బెంగ్లూరు మొదలగునవి.

ఓడదారి:- ప్రపంచమున ప్రతిచోట సముద్రసంచారమునకై "స్థలము బుక్" చేయబడును ఇంకను టికెటు మొదలగునవి కూడ యిక్కడినుంచి సప్లయిచేయబడును.

ఆకాశవిమాన సర్వీస్:-యూరప్, హిందూస్థానం సంచారార్థము టికటు పార్సల్ మొదలగు వాటికికూడ వ్యవస్థ చేయబడును.

ప్రామిసరీనోట్లు:-బ్రిటిషు గవర్నమెంటు, మైసూరు గవర్నమెంటు, నిజాంగవర్నమెంటుయొక్క ప్రామిసరినోట్లు క్రయవిక్రయము చేయబడును.

వాటికల్దారుయొక్క మారకం, మరియు అన్నివిధములగు బ్యాంకులయొక్క పాటులప లాభకరమైన సలహా యివ్వబడును.

బంగారునగలు తక్కువ వడ్డీపై గిర్వీయుంచబడును. వివరములు జాబులువ్రాసిగాని స్వతఃవచ్చిగాని తెలిసికొనవచ్చును.

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
అరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషుఇండియాకు
సం॥ చందా
౫-౮-౦ కల్దారు
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

*Volume* **15** **Hyderabad-Dn.** **Thursday 8 August 1940** ***Number* 28**


## శ్రీ॥శ్రీ॥ మైసూరు మహారాజుగారు

### సంక్షేప జీవిత చరిత్ర

బెంగుళూరు, ఆగస్టు ౩

నేటి రాత్రిసుమారు తొమ్మిగంటలకు మైసూరుమహారాజా శ్రీకృష్ణరాజేంద్ర ఒడయారు బహదూరు గారు ప్రశాంతముగా బెంగుళూరు రాజభవనమున పరమపదించిరి

మహారాణి, యువరాజా, యువరాణి, దివాను సర్ మీర్జా ఇస్మాయిలుగార్లు, ఇంకా అనేకమంది ముఖ్యప్రభుత్వోద్యోగులు మహారాజుగారి మరణ సమయమున రాజభవనము నందుండిరి

వీరికాలంలో ౧౯౦౦లో సంస్థానములో మొత్తం ౭౫౮౨ పాఠశాలలుండినవి అనగా ప్రతి ౩౫ చదరపు మైళ్లకు ౧౦ పాఠశాలలు స్థాపించబడినది. వారిపరిపాలనా కాలములో అనేక గ్రామసౌభాగ్య కేంద్రములు, అనాథ శరణాలయములు, ఆసుపత్రులు, ప్రసూతిగృహములు సంస్థానములో స్థాపించబడినవి వీటికంటె ఎక్కువగా, సంస్థానములో విశేష ఇరిగేషను వర్క్సు విద్యుత్ ప్రసారస్థానములు, నానా పరి

మహారాజాగారికి గతఆదివారము హృద్రోగము వచ్చినది. నేటిసాయంత్రము అదేతిరిగివచ్చుటవల్ల వారు మరణించిరి

సంస్థానమున, బయటను అన్ని ప్రభుత్వకార్యాలయములు, కోర్టులు, విద్యాసంస్థలు మహారాజాగారి గౌరవార్థము ౧౫ దినములు మూయవలసెనని ఉత్తరవుచేయు అసాధారణ గెజటు ప్రకటింపబడినది.

మహారాజాగారికి యెంతవయస్సో, అన్ని (అనగా ౫౭) ఫిరంగిగుండ్లు నిమిషమున కొకటి చొప్పున బెంగుళూరులోను, మైసూరులోను ప్రయోగించబడినవి

### సంగ్రహ జీవితము

శ్రీ॥శ్రీ॥ మైసూరు మహారాజా శ్రీకృష్ణరాజేంద్ర ఒడయారు బహదూరుగారు ౧౮౮౪-౧౯-౬ తారీఖున జన్మించిరి. పదే వత్సరాల వయసులోనే, వారితండ్రి మరణాంతరము ౧౮౯౫-౨-౧వ తేదీ వారు సింహాసనమధిష్ఠించిరి ఆ తర్వాత ౭ సంవత్సరములవరకు మైసూరు సంస్థానమును వారితరపున సంరక్షకులు పాలించిరి ౧౯౦౨-౮-౮వ వారి ౧౮వ జన్మదినమున వారికిసంపూర్ణ పాలనాధికారములను అప్పుడు వైస్రాయిగానుండిన కర్జను ప్రభువుగారు ఇచ్చిరి

ప్రము స్థాపనము మహారాజుగారి పురోగమన విధానమునకు నిదర్శనముగానున్నది. వ్యవసాయము, గృహపరిశ్రమల వృద్ధికి యిచ్చుటలోకూడా చాలాపనిజరిగినది.

వారిపరిపాలనాకాలమున మైసూరులో ఒక శాసనసభ స్థాపింపబడినది

శ్రీకృష్ణరాజేంద్ర ఒడయారుగారు నిరాడంబర జీవి, ఎక్కువకాలము ఏకాంతముగ జీవితము గడపెడివారు. ఆటవేటలలోనుంచి ఉత్సాహము కలవారు అయినప్పటికీ పుస్తకములను చదివేవారు సంస్కృతసాహిత్యము, వేదాంతము వారిఅభిమానవిషయములు

శ్రీ॥శ్రీ॥ మహారాజాగారు గొప్పసంగీతపోషకులు వారిఆస్థాన సంగీతవిద్వాంసులు జాతగాత్ర ౨౦ గీతములలో దేశములో సామాన్యముగ అందరికంటె మిన్నగా నుండేవారు

### ప్రజా ప్రభుత్వ సహకారాశయము

జాతీయ కాంక్షలను ఆశయమును చక్కగా సాధించుటమనముతోనాము, ప్రభుత్వముతో ప్రజలను సాకార మొనర్చవలసినదని వారుఅనేకమార్లుపదేశమిచ్చిరి "ప్రముఖ్యముతెన స్వంత కృషిచెల్లచెయగలది చాలాతక్కువే ప్రజలే పూనుకొని, పట్టుదలతో త్యాగముతో సాధించినగాని నిజమైనఅభివృద్ధికలగజాలదు" అని మహారాజాగారు ఒకప్పుడుపలికిరి మహారాజాగారి సందేశము మైసూరు ప్రజలమనస్సులో నాటుకొని ఆర్థికాభివృద్ధియందు ప్రజలుసంపూర్ణ సహకారము చేసిరి ఇప్పుడు పెద్ద పరిశ్రమలు ౩౦ ఉన్నవి. గృహపరిశ్రమలు, గ్రామ పరిశ్రమలు మూడు సంవత్సరముల ప్రణాళిక ప్రకారము అభివృద్ధిచేయబడుచున్నవి

### మత స్వాతంత్ర్యము

మతసహనము గురించి శ్రీకృష్ణరాజేంద్ర ఒడయారుగారు యిట్లు ఒకప్పుడు ప్రపంచక్రైస్తవ విద్యార్థి ఫెడరేషను సమావేశము నకు చెప్పిరి

"నాపూర్వీకుల ఆచారముల ననుసరించుచూనా ప్రభుత్వమునకు ఆ సహనము, వాక్స్వాతంత్ర్యము మఖ్య మంత్రములుగా నుండునట్లు చూచుచున్నాను"

---

## డకా - కలకత్తా మెయిలు ప్రమాదము

### ౩౬ మంది మరణము ౯౦ మందికి గాయాలు

కలకత్తా ఆగస్టు౩

ఢక్కానుంచి కలకత్తావచ్చుచున్న మెయిలు ట్రెయిను నిన్నరాత్రి ౨గం. ౫౦ నిమిషాలప్పుడు మెయిను లైనులో కలకత్తాకు ౭౫ మైళ్ళ దూరములోవున్న జయరాంపూరువద్ద పట్టాలనుంచి తొలగిపోయెను. యింజనున్ను మూడుబోగీబండ్లున్ను గట్టుమీదనుంచి క్రిందపడిపోయెను అసిస్టెంటుట్రాఫిక్కు సూపరింటెండెంటున్ను చీఫ్ మెడికల్ ఆఫీసరున్ను నేటి వుదయము ౫గంటలకు అక్కడికి వెళ్ళిరి వెంటనే గాయములు తగిలినవారిక ప్రథమచికిత్స చేసిరి

గాయములుతగిలినవారిని డార్జిలింగు మెయిలులో కలకత్తాకుపంపిరి రైలుపట్టాలను యెవరో తీసినారు. అందువల్లనే యీప్రమాదము కలిగినది జిల్లామేజస్ట్రీటు పోలీసు సూపరింటెండెంటు, రైల్వేలగవర్నమెంటు సీనియరు ఇన్స్పెక్టరు మొదలైనవారుకూడా అక్కడికి వెళ్ళినారు.

గాయపడినవారందరు మూడవతరగతిలోనివారేఅని తెలిసినది, పడిపోయిన మూడుబోగీలలోను రెండుబోగీలలో ప్రయాణికులున్నారు,

ఆగస్టు౭వరకు తెలిసిన సమాచారమునుబట్టి ఆప్రమాదములో ౩౬మందిచనిపోయిరి ౯౦మంది గాయపడిరి,

---

## బిదరు యుద్ధకాండ

### విచారణముగిసినది

### విరల్ దాసుకు యావజ్జీవశిక్ష.

బిదరులోని యుద్ధకాండలో ఒకభాగము గతమాసము ముగిసియుండెను వకీలునుచంపిననేరముఋజువుకానందున నిందితులువదలివేయబడిరి

తర్వాత ఒక ఒట్కా వానిని తుపాకితో బ్రిజ్‌పాల్ అనేవాడు కాల్చియుండెను, వానికి సహాయముగా మాన్సింగ్ అనేవాడుండెనట విఠల్ దాసు అనేమార్వాడీ బ్రిజ్‌పాలును తనయింటిలో దాచియుండెనట ఈవిచారణ వరుసగా జరిగెను తండోపతండాలుగా సాక్షులు గైకొనబడెను ఈవిచారణను గుల్బర్గా సెషన్‌జడ్జిగారగు మిర్జాహుసేన్ అహ్మద్ బేగుగారు కావించిరి మంగళవారము ఆగస్టు౬వతేదీనాడు న్యాయాధీశ్వరులవారు తమ తీర్పును వినిపించిరి— ఆదేమనగా—

తుపాకితో కాల్చినవాన్ని తనయింట్లో దాచిపెట్టిన విఠలదాసుకు యావజ్జీవం జెయిలుశిక్ష ౧ సంవత్సరం కఠినశిక్ష ౫౦౦ రూపాయిల జుర్మానా అది చెల్లించకుంటే మరొకసంవత్సరము జెయిలుశిక్ష అదెందుకయ్యాఅంటే— "యీ విరల్‌దాసే తర్వాతిఅల్లరుల కన్నిటికిని బాధ్యుడు. ఈశిక్షను తగ్గించేదానికేమిన్నీ కారణం కానరాదు. ఈనిందితునిపై ఋజువైననేరానికిదేశిక్ష" అని న్యాయాధీశులుగారు వ్రాసినారు. ఇక తుపాకితో కాల్చిన బ్రిజ్‌పాలుకు 'ఖూనీప్రయత్నం' చేసిన నేరము ఋజువైనదికాన ౫ ఏండ్లు జెయిలులో కఠినశిక్ష అనుభవించవలెనని శాసించిరి మూడవనిందితుడగు మానిక్ అనువానికి ౬నెలలు కఠినశిక్ష విధించిరి

ఈబిదరుఅల్లరి ౨౬మార్చి ౪౦ నాడు జరిగియుండెను,

---

## యుద్ధవార్తలు

(మొదటిపేజీ తరువాయి)

తభాగమును మొల్దేవియా ఫెడరల్ సోవియటు రిపబ్లికులో చేర్చునట్టియు, బెసరేబియాలోని తక్కినజిల్లాలు, ఉత్తర బుకోవినాయుకలిపి యుక్రేనియా సోవియటు రిపబ్లికులో చేర్చునట్టియు శాసనమును సోవియటు పార్లమెంటువారామోదించిరి

### ఫిన్లెండు

చేరక స్వాతంత్ర్యమును నిలుపుకొనియున్నది.కాని రష్యావారు దానినట్లుండనిచ్చేటట్లు లేదు.

బాల్టిక్‌లో ఫిన్లెండు ఇంకను సోవియటులో దానిని కలుపుకొనుటకు సాకేమాయని వెదకుచున్నట్లున్నది ఫిన్లెండలో "సోవియటుసంఘతో మైత్రిగలిగి శాంతముగా నుండవలెననుకొనుసంఘము" గలదు ఈసంఘముయొక్క సభజేయగా ఫిన్లెండు అధికారులు అటంకపరచిరనియు, పోలీసువారలు సభకువచ్చినవారిని లాఠీలతో కొట్టిరనియు, మరికొన్నిచోట్లకూడ ఇట్టిసంఘర్షణలు జరిగెననియు, ఈవిధముగా మూడునెలలనుండి జరుగుచున్నవనియు రష్యాఅధికారవార్తాసంస్థవారొకవార్త ప్రకటించినారు పైనచెప్పబడిన "సోవియటుమిత్రులు"ఫిన్లెండుప్రభుత్వము వహించుగాక, ఫిన్లెండును మరియొకసారి బాంబుచేసెదరను నిట్టి బెదరింపుకేకలువేయుచు జూను ౩౦వతేదీ వీధులలో తిరుగుటచేసిన్నిషుపోలీసులు బోక్కయుకల్పించుకొనవలసివచ్చెననిఫిన్లెండు వర్గలు దెల్పుచున్నవి రష్యా ప్రధాననగరమగు మాస్కోలో పత్రికలు ఫిన్లెండుపోలీసులు "రష్యామిత్రు"లలో చేరినస్త్రీలను వృద్ధులనుకూడ లాఠీలతోకొట్టిరని ఘోషపెట్టుచున్నవి రష్యాప్రభుత్వము ఫిన్లెండుప్రభుత్వము స్వయముగా పాలనచేయుట కనర్హము కాబట్టి సోవియటురాజ్యాంగములో నొకభాగముగ నుండవలసినదని

---

## కాంగ్రెసు సత్యాగ్రహకమిటీ అధ్యక్షుని అరెస్టు

కరాచీ, ఆగస్టు ౨౧

జిల్లా సత్యాగ్రహకమిటీ అధ్యక్షుడును, నవభారతపత్రిక సంపాదకుడునుఅగు శ్రీసచ్చిదానంద హారిమల్‌గారు డిఫెన్సుఆఫ్ఇండియాఆక్టుక్రింద అరెస్టుచేయబడెను. ఆయన ౫౦౦౦రూపాయీల జామీనుపై విడుదలచేయబడెను. కేసుఆగస్టు ౭తారీకు వాయిదావేయబడెను,

---

కోరుటను ఇది మొదటిపాతకల్పన కావచ్చును,

### రష్యా అమెరికాల వాణిజ్యపు ఒడంబడిక

రష్యా అమెరికాల ప్రాతవాణిజ్యపు ఒడంబడిక గడువు ఆగస్టు ౫వతేదిరాత్రితో తీరిపోయినది. మరల ఒడంబడికనుగావించుటకు ఏర్పాటులన్నియు పూర్తియైనవి

## సైన్యాధికారులతో హిట్లరు ఆలోచనలు

హిట్లరు గారు కొన్నిరోజులనుండి జర్మను సైనికాధికారులతో బ్రిటనుపై దాడివిషయమై ఆలోచించుచున్నారని ఒకవార్త వచ్చినది అదాడియత్నాలసంగతి పరులకు తెలియకుండుటకై ఫ్రాన్సు జర్మనీలమధ్య టపాలు, టెలిఫోను, టెలిగ్రాఫు సంబంధములను తెగద్రెంచివేసినారు. బ్రిటిషుప్రధాని బ్రిటిషుప్రజలకుపంపిన ఒకసందేశములో జర్మనులెప్పుడైనను దాడిసల్పవచ్చును. కాబట్టి బ్రిటిషుప్రజలు సర్వదా సంసిద్ధులుగానుండవలెనని హెచ్చరిక చేసినాడు.

బ్రిటనుపై జర్మనువిమానాలు ప్రతిరోజుఎగిరి బాంబులువేయుచున్నవి. ఆగస్టు ౧వతేదిమధ్యాహ్నము జర్మనువిమానాలు బ్రిటిషుఓడలపైబాంబులువేసెను వాటిలో ౫ క్రిందకూల్చబడెను.

ఆగస్టు ౨వతేది ౩వతేది రాత్రులలోను, ౪వతేది జర్మను విమానాలు, ఇంగ్లాండు, స్కాట్లెండు, వేల్సులపై అక్కడక్కడబాంబులువేసెను. ౪వతేది రెండు బ్రిటిషు వేస్తనావలవారు ఒక జర్మనుబాంబరును క్రిందికికూల్చిరి. ఆగస్టు ౨వతేది ఒక బ్రిటిషుఓడ నష్టమయ్యెను. ఆగస్టు ౩వతేదిరాత్రి జర్మనువిమానాలు ఇంగ్లాండు వేల్సులలో కొన్నిజిల్లాలపై హిట్లరుగారు ఇటీవల రీస్టాగులో ఇచ్చిన ఉపన్యాసపు కరపత్రాలను వెదజల్లెను ఆగస్టు ౫వతేదిని దాడులలో ౩ జర్మనువిమానాలు,, ఒక బ్రిటిషువిమానము నష్టమయ్యెను జూను ౧౯నుండి ఆగస్టు ౫వరకు జర్మనీకి ౩౦౦ విమానాలు నష్టమైనవి బ్రిటనువిగి౫౦ మాత్రమే

### జర్మనీపై బ్రిటిషు విమానాలు

జర్మనీపైనను జర్మనీక్రిందికివచ్చిన హాలెండు, ఫ్రాన్సు మున్నగు దేశాలపైనను బ్రిటిషువిమానాలు ప్రతిరోజు సంచరించుచు, ఎప్పటివలె బాంబులువేయుచునేయుండెను.

### బ్రిటనుకు సహాయము

ఆగస్టు ౩వతేదినాటికి కొన్ని ఆస్ట్రేలియా సేనలున్ను కొన్ని కెనడా సేనలున్ను బ్రిటనుకు చేరెను అమెరికా డిస్ట్రాయర్లను వెంటనే బ్రిటనుకు అమ్మవలెనని జనరలు పెర్షింగుగారుచేసిన సూచనవిషయమై అమెరికాపత్రికలు చాలా కొనియాడుచున్నవి. కాని శాసనసభవారు అనుమతించనిది తానేమియు చేయజాలననిఅధ్యక్షుడురూజ్వెల్టుగారనుచున్నారు.

## ఇటలీ యుద్ధము

ఇటలీ, బ్రిటనులయుద్ధంలో ఆగస్టు ౩వ తేది అబిసీనియాసరిహద్దులో ఒక చిన్న ప్రదేశాన్ని బ్రిటిషుసేనలు పట్టుకొనెను ఇక తక్కినవన్నీ విమానాలదాడులవార్తలే ఆగస్టు ౧వ తేదినుండి ౫వతేదివరకు జరిగినదాడులలో ౬ ఇటలీ విమానాలు క్రింద కూల్చబడెను


**Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor- S Prathapa Reddy B. A. B. L.**